# అందరికీ నమస్కరించి.....

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి అనుగ్రహంతో, ఆశీస్సులతోను; పాఠకుల ప్రోత్సాహంతో, రచయితల సహకారంతో, స్పందన ప్రింటర్స్, విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, లక్ష్మీబ్లాక్ మేకర్స్‌వారి సహాయంతో 34 సంచికలు నిర్విఘ్నంగా తెలుగు పాఠక లోకానికి అందించగలిగాను. ఈ రోజులలో సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక మాస పత్రికను నడపడం అంత తేలికకాదు. ఒక వైపు సెక్స్ సాహిత్యం, ఎల్లో జర్నలిజం పరవళ్ళు త్రొక్కుతున్న తరుణంలో ' శ్రీవాణి ' లాంటి మాస పత్రికను నడపడం చాలా కష్టం. కాగితం, ప్రింటింగ్, పోస్టలు రేట్లు పెరుగుతున్నా, ఆటుపోట్లను తట్టుకుంటూ, ధృఢ సంకల్పంతో, Devotion తో లాభాలను దృష్టిలో పెట్టుకొనకుండా, ఏమాత్రం స్థాయిని తగ్గించకుండా ' శ్రీవాణి ' ని ప్రతినెలా పాఠకులకు అందిస్తున్నాను.

భగవాన్ బాబా అనుమతితో, ఆశీస్సులతో వారి జన్మదినోత్సవ ప్రత్యేక సంచికను సర్వాంగ సుందరంగా కలర్ ఫొటోలతో, విజ్ఞానదాయకమైన వ్యాసములతో, భక్తుల అనుభూతులతో, బాలల గేయములతో తీసుకొనిరా సంకల్పించినాను. ఒక్క మాటలో చెప్పాలంటే ఆ ప్రత్యేక సంచిక Encyclopaedia of Baba అనవచ్చును. సహజంగా ప్రత్యేక సంచిక అంటే సగం పేజీలు అడ్వర్‌టైజ్‌మెంట్సుతో ముంచివేయటం పరిపాటి. అయితే ఈ ప్రత్యేకసంచికలో మాత్రం అడ్వర్‌టైజ్‌మెంట్సుకు ప్రాధాన్యత యివ్వడంలేదు. Tariff వేసుకొని ప్రకటనల కోసం తిరుగదలచలేదు. అయితే ఇది ఒక బృహత్తర పథకం. ఖర్చు ఎక్కువమొత్తంలోనే అయ్యేటట్లుగా ఉన్నది. అయితే ఈ ప్రత్యేక సంచికను తీసుకొని రావడం ఎట్లా ? అనే ప్రశ్న ఎదురైంది. ఎవరైనా సహృదయులు వారంతట వారే ముందుకు వస్తే, అది కూడా ఎనిమిది అడ్వర్‌టైజ్‌మెంట్సుకు మాత్రమే అవకాశం యివ్వ సంకల్పించాను. ఎందువల్లనంటే అడ్వర్‌టైజ్‌మెంట్సుతో నింపి ఈ ప్రత్యేక సంచిక పవిత్రతకు భంగం వాటిల్లే ప్రయత్నం చేయదలచలేదు.

శ్రీవాణి పాఠకులకు, అభిమానులకు, సాయి కుటుంబ సభ్యులకు ఒక చిన్న మనవిని మాత్రం చేస్తున్నాను. ఈ ప్రత్యేక సంచికను సాధ్యమైనంత ఎక్కువమందికి అందించే ప్రయత్నంలో సహకరించమని కోరుతున్నాను. చందాలు చెల్లించవలసినవారు, రెన్యూవల్ చేయవలసినవారు అక్టోబరు 15 వ తేదీలోపు పంపి సహకరించ ప్రార్థన. సహృదయులైన కొంతమంది పాఠకులకు ప్రత్యేకంగా లేఖలు వ్రాశాను. అట్టివారు సహృదయంతో ముందుకు వచ్చి ఒకే పర్యాయం 4 సం. చందా (రు. 116-00) గాని, జీవిత సభ్యులు (రు. 500-) గా గాని చేరి శ్రీవాణికి ఆర్థిక పుష్టిని కలుగజేస్తారని విశ్వసిస్తున్నాను. శ్రీవాణికి బలం చందాదారులే. సహృదయులైన పాఠకులే. శ్రీవాణి నిజంగా ఉండదగ్గ మంచి పత్రికేనని భావిస్తే చేతనయినంత సహాయం అందించండి. స్నేహితులకు, బంధువులకు పరిచయం చేయండి. శ్రీవాణి సర్క్యులేషన్ పెంచండి. నాలుగు కాలాలపాటు సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా, విజ్ఞాన ప్రచారం శ్రీవాణి ద్వారా జరిపేందుకు అవసరమైన సహకారమును అందించుతారని ఆశిస్తున్నాను.

రాష్ట్ర స్థాయిలో ' శ్రీవాణి ' కి విశిష్ట అవార్డు లభించినందులకు ఎందరో పెద్దలు ప్రశంసిస్తూ లేఖలు వ్రాశారు. వారలకు కృతజ్ఞతలు. అవార్డు పిక్చర్ లాగానే ఉన్నది ' శ్రీవాణి ' ఆర్థిక పరిస్థితి. అవార్డు పొందిన 'శ్రీవాణి' ని పాఠకులు తమ మిత్రులకు, బంధువులకు పరిచయం చేసి ప్రోత్సహించమని ప్రార్థిస్తున్నాను.

**చందాలు రెన్యూవల్ చెయ్యనివారికి**
**ప్రత్యేక సంచిక పంపబడదు.**

కొమరగిరి కృష్ణమోహనరావు

అక్టోబరు - 1987

సంపుటి : 3

సంచిక : 10

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు - కొమరగిరి కృష్ణమోహనరావు



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818



| | |
|---|---|
| విడి ప్రతి | : రు. 3-00 |
| సంవత్సర చందా | : రు. 36-00 |
| 2 సం॥ల చందా | : రు. 66-00 |
| 4 సం॥ల చందా | : రు. 116-00 |
| జీవిత సభ్యత్వం | : రు. 500-00 |

Cheques & Drafts should be drawn in favour of SREEVANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS

MACHILIPATNAM


## విషయసూచిక



ముఖచిత్రం : లోకనాయక్ జయప్రకాశ్‌నారాయణ్

శ్లో॥ శివశ్శక్త్యాయుక్తో యదిభవతి శక్తః ప్రభవితుం
నచే దేవం దేవో నఖలు కుశలః స్పందితు మపి
అతస్త్వా మారాధ్యాం హరి హర విరించ్యాదిభిరపి
ప్రణంతుం స్తోతుంవా కథ మకృత పుణ్యః ప్రభవతి ?॥ (సౌందర్యలహరి)

సకల చరాచర సృష్టికి మూలకారణం జగజ్జనని పరాశక్తి. ఆ తల్లి లీలా విలాసమే ఈ సృష్టంతా. అణువణువునా వ్యాపించియున్న ఆ తల్లి కరుణాకటాక్ష విశేషంతోనే సర్వ ప్రాణులలో స్పందనాదులు జరుగుతువ్నవి. అలాంటి అమ్మవారి అనుగ్రహముంటేనే దేవతలు సైతం తమ తమ విధులను నిర్వర్తించగలుగుతున్నారు.




సాక్షాత్తు సదాశివుని ఆరాధించే భక్తులు శివ పారమ్యాన్ని తప్ప మరో తదతీతశక్తిని అంగీకరించరు. అటువంటి శివుడు కూడా అమ్మవారితో కలిసి వున్నప్పుడే తన కర్తవ్యంలో సమర్థుడగుతున్నాడట. శివశక్తిలో నున్న శక్తియే అమ్మవారు; ఆ అమ్మ కనికరించకపోతే అయ్యవారిపని సున్న. ఆ శక్తితోనే శివుని విజృంభణ సాగుతున్నదట. అలా కాకపోతే శివదేవుడు కొంచెమైనా కదలలేడు, నీరసించి స్థాణుపై పోతాడు. అంతే కాదు. త్రిమూర్తులయిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సృష్టి స్థితి లయాలనే తమ కార్యాలను నిర్వర్తిస్తున్నారంటే అదంతా ఆ అమ్మ చలవే.

ఈ ముగ్గురూ ఆ తల్లి సృష్టిస్తే వచ్చినవారే. ఆమె సంకల్పంతోనే వారు తమ కర్తవ్యంలో సమర్థులవుతున్నారు. అటువంటప్పుడు మిగిలిన దేవతల విషయం చెప్పవలసినదేముంది ! సర్వ దేవతలలోని శక్తి ఆ తల్లియే. ఆమె యిచ్ఛ లేకుండా అగ్నిలో దాహక శక్తి వుండదు. వాయువులో ప్రసరణం జరగదు ! ఇంద్రాదులందరు ఆమె ఆజ్ఞకు బద్ధులై ప్రవర్తించే పరిచారకులు. ఆమె అనుగ్రహాన్ని వుపసంహరించుకొంటే సర్వ దేవతలు త్రిమూర్తులు అందరూ తనలో లయించిపోతారు.

అందుచేతనే హరి హర బ్రహ్మాదులకు కూడా ఆ శక్తి ఆరాధ్య దేవత అయింది. కనుకనే సర్వాతీతమైన సర్వ కారణమైన ఆ లోకమాత పరాశక్తిని స్తోత్రం చేయటానికి గాని ఆమెకు నమస్కరించటానికి గాని అందరికి సాధ్యం కాదు. పాపాత్ములు ఆమెను స్తుతించనూ లేరు నమస్కరించనూ లేరు. పుణ్యం చేసుకొన్న అదృష్టవంతులకే అది దక్కుతుంది. ఈ భావాన్ని వ్యక్తం చేస్తూ ఆచార్య శంకరులు అమ్మవారిని పలకరించారు సౌందర్యలహరిలో.

“ శక్తి రూపేణ సంస్థితా ” అని మనలో వున్న ఆ శక్తియే జగజ్జనని. ఆ శక్తియే నవదుర్గా రూపాలను సృష్టించుకొని భండాసురాది రాక్షసులను సంహరించింది. ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులుగా వర్ణింపబడే పరాశక్తియే సమ సమునకు మూలం.

# మహాత్మాగాంధీజీ ఆలోచనలు - అభిప్రాయాలు

"మానవసేవలో దైవాన్ని దర్శించడానికి నేను కృషి చేస్తున్నాను. ఎందుకంటే - దేవుడు స్వర్గంలో లేడు, నరకంలో లేడు; ప్రతిఒక్కరిలోనూ ఉన్నాడు."

"గ్రామాలను గ్రామీణ కుటీర పరిశ్రమలను, చేతి వృత్తులను నాశనం చేసే విధంగా పారిశ్రామికీకరణ ఇంతవరకు సాగింది. ఇకముందు, అది గ్రామాలకు, గ్రామాలలోని వృత్తులకు దోహదకారి కావాలి. కేంద్రీకృత పరిశ్రమలు ప్రభుత్వం చేతుల్లో వుంటే ప్రజలకు మేలు కలుగుతుందనే సోషలిస్టు సిద్ధాంతంలో నాకు నమ్మకం లేదు."

"వాంఛలపై వాంఛలను అల్లుకుంటూ పోవడం కాక వాంఛలను ప్రయత్నపూర్వకంగా తగ్గించుకుంటూ పోవడం సభ్యతా లక్షణం."

"సత్యమే నాకు దైవము. అహింసద్వారా మాత్రమే నేను దైవాన్ని చేరుకోగలను."

"అన్ని మతాల అంతిమ లక్ష్యం పరమేశ్వర సాక్షాత్కారమే."

"కాంగ్రెసువాదులకు నిర్మాణాత్మక కృషి లో తగినంత ఆసక్తి లేదు. కనుక మనం కలలు కనే సామాజిక వ్యవస్థను నేటి కాంగ్రెసుపార్టీద్వారా నిజం చేయడం అసంభవం. నేడు అవినీతి విలయ తాండవం చేస్తున్నది. నన్ను భయాందోళనలకు గురి చేస్తున్నది. ఓట్ల వల్ల పదవులు లభిస్తాయి కనుక ప్రతి వ్యక్తీ వీలైనంత హెచ్చు సంఖ్యలో ఓట్లు తన గుప్పిట్లో పెట్టుకోవాలని తాపత్రయ పడుతున్నాడు. పదవులు సంపాదించాలన్న భావాన్ని బహిష్కరిస్తే, మీరు అధికారాన్ని సన్మార్గంలో నడిపించ గలుగుతారు. మన స్వరాజ్యాన్ని పురిట్లోనే పీక నులిమివేసేటట్లున్న అవినీతిని అరికట్టడానికి మరో మార్గం లేదు."

"విప్లవానికి కరుణను జోడిస్తే సహాయ నిరాకరణ, సత్యాగ్రహం అనే కార్యక్రమాలు రూపొందుతాయి."

"అహింస పిరికితనానికి ముసుగు కాదు. పరాక్రమవంతుని పరమగుణం."

"ప్రేమ యిస్తుందే గాని ఇమ్మని కోరదు. ప్రేమ బాధలను సహిస్తుందేగాని ప్రతీకారం తలబెట్టదు."

"కృషి చేయకుండా మెక్కేడివారు దొంగలు."

"విద్యార్థులు - పక్షముల రాజకీయాలలో పాల్గొన రాదు. రాజకీయ సమ్మెలలో పాల్గొనరాదు. నాయకుల యెడ తమకున్న శ్రద్ధాభక్తులను, వారి సద్గుణములను అలవరచుకొనడంలో చూపాలి గాని, వారి రాజకీయములలో పాల్గొనడం ద్వారా కాదు. రాజకీయ అధ్యయనం మాత్రం చేయనగును."

"సత్యాన్ని ప్రేమించే వాడే అసత్యాన్ని ఖండించ గలడు. సత్యజీవనం వల్ల అంధ విశ్వాసాలు పటాపంచలై పోతాయి. సత్యవాక్కు వ్యర్థంకాని సుస్థిరవాక్కు. సత్యం గొప్పతనం నిగ్రహులకు మాత్రమే తెలుస్తుంది, సమత మమతల సంరక్షణే సత్యం. అసహనాన్ని, దౌర్జన్యాన్ని అరికట్టే మహత్తర శక్తి సత్యం. నీతికి, నిర్భీతికి ఆధారం సత్యం. మానవ హృదయ ప్రశాంతికి, జీవన సుఖశాంతికి సత్యం సరయిన దారి."

# విజయదశమి పేరెలా వచ్చింది?

భారతదేశంలో జరుపుకొనే ప్రధానమైన పండుగలలో విజయదశమికి ఎంతో ప్రాముఖ్యత వున్నది. ఈ పండుగను అనాదికాలం నుండి హిందువులు సాంప్రదాయ బద్ధంగా ఎంతో భక్తి శ్రద్ధలతో జరుపుకుంటున్నారు. దుష్టశిక్షణ, శిష్టరక్షణకు ప్రత్యేకమయిన ఈ విజయదశమినే హిందువులు వాడుకగా దసరా పండుగగా కూడా జరుపుకుంటున్నారు.

విజయదశమి పండుగకు ఆపేరు రావడానికి గల కారణాలు అనేకం మన ప్రాచీన గ్రంథాలలో చెప్పబడినాయి.

విజయాంబ అనే నామాంతరం గల దుర్గాదేవి ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి నవమి వరకు పోరాడి దశమినాడు దనుజ నిర్మూలనం గావించి శిష్ట రక్షణ గావించిందని 'దేవీ భాగవతాన్ని' పరిశీలిస్తే తెలియు చున్నది. దీనిని బట్టి విజయాంబకు విజయం చేకూర్చిన దశమి విజయదశమిగా ప్రాచుర్యాన్ని పొందింది. ఇక 'చతుర్వర్ణ చింతామణి' అనే గ్రంథ కథనం ప్రకారం ఆశ్వయుజ నామ శుక్ల దశమి నాటి నక్షత్రోదయ సమయాన్ని "విజయం"గా భావించబడుతుందని, కనుక, ఆ దశమిని విజయ దశమిగా పరిగణించ బడుతున్నదని తెలియుచున్నది, ఇంతేగాక "అర్జునస్యధనుర్ధారీ.... ధరిత్ర్యర్జున బాణానాం" అనే శ్లోక విశేషాన్ని బట్టి విజయుడుగా పేరొందిన అర్జునుడు విరాటుని గో రక్షణకై కౌరవ సేనను ఎదిరించి దశమినాడు విజయాన్ని పొందడం చేత ఆ రోజు 'విజయదశమి'గా పేర్కొన బడిందని కూడా భావించవచ్చు.

పురాణ గ్రంథాలను పరిశీలించినప్పుడు విజయదశమి ప్రాశస్త్యం బహువిధాలుగా తెలుపబడుతున్నది. "బృహద్ధర్మ పురాణం" లో శ్రీరాముడు దేవీ పూజను గావించి దశమినాడు రావణ వధ గావించెనని, ఆ విజయోత్సవ చిహ్నంగా విజయదశమి పండుగ ఆచరణలోనికి వచ్చెనని తెలియుచున్నది.

ఈ విజయదశమికి, పూర్వం రాజులు జైత్రయాత్ర చేస్తే శ్రేయోదాయకమని భావించెడివారు. నేటికీ విజయ దశమి నాడు ఆయుధ పూజను ప్రజలు జరుపుకుంటున్నారు.

వేదకాలం నుండి ఎంతో పేరుగాంచిన "విజయదశమి" శౌర్య, ధర్మ విజయానికి సంకేతంగా, ఆదిశక్తి ఆరాధనా దినంగా ప్రణుతికెక్కింది.

అయితే ఈనాటి కాల పరిస్థితులను బట్టి అన్ని పండుగలతో పాటు ఈ ముఖ్యమైన పండుగను కూడా ప్రజలు అంత ఉత్సాహంగా జరుపుకోవడం లేదు.

— కొండవీటి మురళి

## అమ్మొచ్చింది!

పట్నం నుండి అమ్మొచ్చింది
పలకా బలపము కొనితెచ్చింది!
బడికి వెడితే నీ కిస్తుంది
బడిమానితె నిను దండిస్తుంది!
శ్రద్ధగ బడికి పోవాలి
బుద్ధిగ చదువు చదవాలి!
కంటికి వెలుగు నివ్వాలి
ఇంటికి పేరు తేవాలి!
తప్పుడు పనులు చేయొద్దు
ఎప్పుడు తగవులు తేవద్దు!
అల్లరి జట్టు చేరొద్దు
కల్లమాటలు చెప్పొద్దు!

— రవుల ఆంజనేయశర్మ



# శీలమే విద్యయొక్క పరమార్థము

ఈనాటి విద్యలు విద్యలు కానేరవు. ఈనాటివారిని పొట్టకూటి నిమిత్తము ఆశ్రయించిన బుద్ధులుగా గోచరిస్తున్నాయి. ఇవి యదార్థమైన విద్యలు కానేరవు. స్వార్థపరమైన అవిద్యలుగా గోచరిస్తున్నాయి. "THE END OF EDUCATION IS CHARACTER" శీలమే విద్యయొక్క పరమార్థము శీలము, గుణము లేని విద్యలు చెత్తతో సమానము

## అనుకరణ

దేశముయొక్క భద్రతకు, దేశమును ప్రమాదముల నుండి రక్షించుకొనుటకు మీలో కరుడు కట్టిన దేశసేవ, త్యాగము, ఆధ్యాత్మిక చింతన ఉండాలి. ఈనాడు పవిత్రమైన భావముంచేత వజ్రసంకల్పులుగా తయారయ్యే యువకులు అవసరము. ఈనాడు జీవితమంతా అనుకరణగా ఉన్నది. అనుకరణతో తన భావమును, తన హృదయమును తన వ్యక్తిత్వమును మానవుడు నాశనము చేసుకుంటున్నాడు.

## అనుకరణ అత్యంత ప్రమాదకరం

యువకులు బానిసలవలె ఇతరులను అనుసరిస్తున్నారు. సత్యసాయి కాలేజీలో చదివే విద్యార్థులందరూ ఉత్తమమైన పట్టాలు అందుకోవాలి. ఎట్టి రిమార్కులు లేకుండా చూచుకోవాలి. క్రమశిక్షణ (Discipline), భక్తి (Devotion) విద్యుక్త కర్మ (Duty) - ఈ మూడింటిని దృష్టిలో పెట్టుకొని భావి భారతోద్ధారకులుగా తయారు కావాలి. ఈనాడు విద్యార్థులు డిగ్రీలు పట్టుకొని బజార్ల వెంబడి బిచ్చగాండ్ర వలె సంచరించటం చూస్తున్నాం. పవిత్రమైన భరతమాత గర్భమునందుద్భవించి, భరతమాత బిడ్డలమని చెప్పుకుంటూ, పాశ్చాత్యుల ననుసరించి, హిప్పీలవలె సంచరించే వారిని సంస్కరించటానికి సత్యసాయి కాలేజీ విద్యార్థులు పూనుకోవాలి. మీరు మొట్టమొదట ఆచరించి, ఆదర్శవంతమైన ప్రచార ప్రబోధం చేసి తిరిగి భారతదేశాన్ని తీర్చి దిద్దే విద్యార్థులుగా తయారుకావాలి. నీ కాళ్ళపైన నీవు నిలిచే శక్తిని సంపాదించుకోవాలి. పరులను ఆశ్రయించే బలహీనులుగా తయారు కాకూడదు. నీవు మొట్టమొదట నిన్ను పోషించి, పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులను గౌరవించటం నేర్చుకోవాలి. తల్లి దండ్రులనే గౌరవించలేనటువంటివారు దేశానికి ఏమి సేవ చేయగలరు? ఏమి ఆదర్శాన్ని అందించగలరు?

**శ్రీ సత్యసాయి బాబా**

## సర్వమత సమ్మతము

సాయి సంస్థలు సర్వ మత సమ్మతములు. సర్వ మతములను ఏకోన్ముఖముగా చేసేటటువంటివి ఈ సంస్థలు.

"ప్రపంచమున నొకే మతమున్నది
అదియే ప్రేమ మతము
ప్రపంచమున నొకే కులమున్నది
అదియే మానవకులము
భగవంతుడొకడే యున్నాడు
అతడు సర్వాంతర్యామి
భాష ఒకటియే యున్నది
అది హృదయభాష"

ఈ సత్యాన్ని మీరు దేశానికి చాటి, ఆచరణలో పెట్టి మన కాలేజీయొక్క పేరును అభివృద్ధి గావించాలి. ఏ మతము వారైనను, ఏ తెగకు సంబంధించిన వారైనను "మాతృదేవోభవ, పితృదేవోభవ" ఈ రెండింటిని శిరసావహించి జీవితాంతమువరకు ఆచరించాలి. ఈ దైవ భావమనే దానిని హృదయములో భద్రము చేసుకోవాలి.

"Man without God is not human; God without man is always God" భగవంతుడు లేకున్న మానవుడు మానవుడే కాదు; మానవుడు లేకున్నను భగవంతుడెల్లప్పుడును భగవంతుడే. దీనిలో ఉన్న అంతరార్థము ఏమిటంటే man without God is animal దేవుడు లేని మానవుడు పశువు అని అర్థం.

## కాలము సద్వినియోగం

పశు పక్షి మృగాదులు కూడ ఆహారమును భుజించుట మనము చూస్తున్నాము. ఆలి బిడ్డలతో, భార్యాభర్తల సంబంధముతో జీవితాన్ని అనుభవిస్తున్నాయి. మానవుడు వాని కంటె ఉత్తమమైన స్థితి యందుండి, ఉత్తమమైన మార్గమును అనుభవించాలి. కాని, వానివలె మనముకూడ విషయ వాసనల్లో దిగి, వాని అనుభూతులను అనుభవిస్తున్నామంటే, ఇంక ఈ చదువు మనకెందుకు? ఈ విద్య అంతా అగ్నిలో వేయటానికా? మన విజ్ఞాన, ప్రజ్ఞాన, సుజ్ఞానములన్నియు మట్టిలో పూడ్చటానికా? ఎందుకోసం మనము మానవులుగా పుట్టాలి? బజారులో కుక్కలు అనుభవించే అనుభవమును ఈనాటి విద్యార్థులు అనుభవిస్తున్నారు, ఇంక ఈ విద్యయొక్క విశేష మేమున్నది? విషయ భోగములలో వివేకము విజ్ఞానము ఏమి ఉన్నదో మొట్టమొదట విద్యార్థులు యోచించాలి. మానవుడు పొట్టకూటి నిమిత్తం పుట్టినవాడు కాదు. పశువులు, పక్షులు కూడా తింటున్నాయి. అవి ఏ పంటలు పండిస్తున్నాయి? ఏ కంచెలు కట్టి కాపలా కాస్తున్నాయి? సమయానికి తగిన రీతిగా ఏదో విధముగా తమ పొట్ట పోసుకుంటున్నాయి. పొట్ట నింపుకోవటం ప్రధానం కాదు. జానెడు పొట్టకోసం జీవితమంతా వ్యర్థం గావించుకొనుట మానవునియొక్క కర్తవ్యము కాదు మానవుని నిత్య జీవితమునకు కావలసిన అవసరములు చాల తక్కువ. దీనికి వినియోగించే కాలము మాత్రము ఎక్కువ.

'Time is GoD,
Time is everything!
Don't waste Time
Time waste is Life waste'

కాలమే భగవంతుడు, కాలమే సర్వస్వము; కాలము వ్యర్థము చేయకు, కాలమును వ్యర్థము చేయుట జీవితమును వ్యర్థము చేసుకొనుటయే. కనుక మనము కాలమును కాపాడుకొని ఏదైనా సమాజ సేవ నిమిత్తమై మన కాలమును సద్వినియోగ పరచవలెను.

## ఇంద్రియ నిగ్రహం

జీవితము చాలా పవిత్రమైనది. 16 సం. నుండి 32 సం. వరకు బంగారమువంటిది జీవితము. ఈవయస్సు నందే ఇంద్రియములను నిగ్రహించుకోవాలి. అడ్డునించిన సమస్యలను పరిష్కరించుకోవటానికి, పరిహారము చేసుకోవటానికి, తగినటువంటి శక్తి సామర్థ్యములు కలిగిన వయస్సు ఇదే. కోపముగాని, ద్వేషముగాని, ఉద్రేకము గాని, అలజడులుగాని మనలో చెలరేగినప్పుడు తత్క్షణమే వానిని అరికట్టటానికి తగిన ప్రయత్నము చేయటానికి చాలా ఉత్తమమయిన సమయం ఇదే. ఈ వయస్సునందే నీవు నిగ్రహించుకోలేని బలహీనుడుగా ఉంటే వృద్ధాప్యము వచ్చిన తరువాత ఇంద్రియాలనేమి వశము చేసుకోగలవు? నీలో చెలరేగిన దుర్భావములు, దుశ్చింతలు, దుస్సంకల్పములు తత్క్షణమే నీవు కనిపెట్టిన వానిని నిర్మూలము గావించటానికి తగిన ప్రయత్నము చెయ్యాలి. ఇదే విద్యార్థుల కర్తవ్యము.

## కోరికలు తగ్గించుకోవాలి

మనస్సు ఒక కోతి. అది ఒక పిచ్చికోతివలె ప్రవర్తిస్తుంది. అలాంటి కోతిని మనము అనుసరించకూడదు. మనము దానిని స్వాధీనము చేసుకొని మన

సేవకుడుగా సరిగా మార్చుకోవాలి. మనస్సు కోరిన దంతా ఫలింపజేయుటకు మనము పూనుకోరాదు. మనస్సులో సంకల్పము కలిగిన వెంటనే ఇది మంచిదా ? చెడ్డదా ? ఇది సత్యమా ? అసత్యమా ? నిత్యమా ? అనిత్యమా ? అని విచారణ చేసే శక్తిని నీవు అభివృద్ధి చేసుకోవాలి. మనస్సు అనే దానికి ఒక ప్రత్యేకమైన స్వరూపము లేదు. మనస్సు కేవలము కోరికలయొక్క మూట. ఈ కోరికలు మొట్టమొదట సంకల్పమనే దూది నుండి వస్తాయి. ఆలోచనలనే దూది, కోరికలనే దారము లుగా తయారై మనస్సు (వస్త్రము) అనే రూపాన్ని ధరిస్తుంది. కనుక మనము కోరికలనే దారాలను తగ్గించు కోవాలి. కోరికలు మన జీవిత ప్రయాణమందు మహా భారమైన వస్తువులు. యువకుల జీవితము దీర్ఘ ప్రయా ణము వంటిది. "Less luggage more comfort, make travel a pleasure" తక్కువ సామాగ్రి ఎక్కువ సుఖము, ప్రయాణమును ఆనందప్రద మొనర్చును. నీవు సంతోషముగ ప్రయాణము చేయాలను కున్నచో సామాను తగ్గించుకొనుటకు పూనుకోవాలి.

## నీ కర్తవ్యము

చాలామంది వివిధానుభవములతో, అవస్థలతో, భావ ములతో స్వామివద్దకు చేరుతారు. ఒక పర్యాయం 16 సం. గల పాశ్చాత్య యువకుడు నా దగ్గరకు వచ్చాడు. చాల విచారముగా ఉన్నాడు. అప్పుడు నేను "What class are you studying" అని అడిగాను. " నేను చదవటం లేదు. చదువు మానివేశాను " అన్నాడు. " మరి ఏమి చేస్తున్నావు ? " అని అడిగాను. " నాకు ఏకాగ్రత పోయింది. ఆత్మవిశ్వాసము పోయింది. నేను చదువలేకుండా ఉన్నాను. ఆరు మాసములనుండి జీవితం మీద కూడా విరక్తి పుట్టింది. " అన్నాడు. " ఎందు వలన విరక్తి పుట్టింది ? " అని అడిగాను. " నా రెండవ భార్య విడాకులిచ్చింది. అందువలన విరక్తి కలిగింది " అన్నాడు. వాని వయస్సు చూస్తే 16 సంవత్సరాలు. రెండవ భార్య విడిచిపెట్టిందట. ఇదా జీవితము? కుక్కలు

## సంస్మృతి

కస్తూరీ రచనా పాకం
ద్రాక్షా రస స్వభావికమ్
సత్యసాయి మహాత్త్వం
సర్వత్ర పరిశోభితమ్

కస్తూరీ భావనం భవ్యం
విశ్వాసామృత పూరితమ్
జీవనం పావనం మాన్యం
పరిశుద్ధ హిరణ్మయమ్

కస్తూరీ సౌరభం సర్వం
సాయి పాద సమర్పితమ్
ప్రశాంతి నిలయావాసం
ధన్యమాదర్శదాయకమ్

ప్రాణప్రయాణ పాథేయం
సాయి హస్త రసామృతమ్
లభ్యమానం మహా పుణ్యం
సత్యం సత్యం శివం కరమ్

( శ్రీ ఎన్. కస్తూరిగారి సంస్మరణ సందర్భంగా )

— జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

బ్రతికినట్లు బ్రతకటానికి జీవిస్తున్నాము. మీరు ఇట్టి అపవిత్రమైన కుక్కల బ్రతుకు గడపకూడదు. తల్లి దండ్రులను గౌరవించి, నీతి నిజాయితీలతో నియమ బద్ధ మైన జీవితాన్ని గడుపుతూ భారతీయుడనే సార్థకనామ మును నిలుపుకోవటానికి ప్రయత్నించాలి. నీకు దేహము నిచ్చి, పోషించి విద్యాబుద్ధులను నేర్పిస్తున్న తల్లిదండ్రు లకు కృతజ్ఞతను అందించుట నీ కర్తవ్యము. ఈనాడు నీ తల్లిదండ్రులను నీవు గౌరవించినప్పుడే, రేపు

నీ బిడ్డలు నీకు గౌరవము యిస్తారు, ఈనాడు నీ తల్లి దండ్రులను నీవు గౌరవించక, వారు కన్నీరు కార్చే విధముగా నీవు పూనుకుంటావా? భవిష్యత్తులో నీ బిడ్డలు నీకు అదే పరిస్థితి కలిగిస్తారు. భవిష్యత్తులో శాంతి భద్రతలతో, ఆనందమయమైన జీవితమును గడుపవలె ననుకొన్నచో ప్రతి విద్యార్థి ఈనాడు తగిన పవిత్ర జీవితానికి కంకణం కట్టుకోవాలి. నీ హృదయ సౌందర్యము ప్రధానముకాని, నీ ఆకారము కాదు. నీవు నీహృదయమును శుద్ధ పరచుకొన్నప్పుడే జగత్తును శుద్ధ పరచే అధికారమును పొందుతావు.

## ఆదర్శ ఉపాధ్యాయుడు

విద్యార్థులకు తగిన అధ్యాపకులు కూడా తయారు కావాలి. అధ్యాపకులు చక్కని అభ్యాసము కలిగి, ఉత్తమ భావములతో విద్యార్థులకు తగిన విద్యగఱపాలి. అధ్యాపకులలో దురభ్యాసములున్నచో విద్యార్థులు పాడై పోవుటకు అవకాశముంటుంది. ఒక విద్యార్థి చెడిపోతే దాని వలన అతడే పాడౌతాడు. ఒక ఉపాధ్యాయుడు క్రమశిక్షణ కర్తవ్యాన్ని నిర్వర్తించక పోతే వేలమంది విద్యార్థులు చెడిపోతారు. కనుక లేత హృదయాలు గల విద్యార్థులను అధ్యాపకుల చేతిలో ఉంచినప్పుడు అధ్యాపకులు మహా పవిత్రమైన భావముల చేత, సదభ్యాసములచేత విద్యార్థులను అభివృద్ధి గావించుటకు కంకణం కట్టుకోవాలి. అంతేకాదు నిజమునకు నిజమైన విద్యార్థులు అధ్యాపకులే. ఈనాడు విద్యార్థులు ఒకటి లేక రెండు సంవత్సరాలు విద్యాభ్యాసం చేసి ఏదో ఒక ఉద్యోగ నిమిత్తము వెళ్ళి పోతారు. తరువాత వారు తమ పాఠ్యగ్రంథములను ముట్టరు. కాని అధ్యాపకులు అట్లుకాదు. జీవిత పర్యంతము పాఠ్యగ్రంథములను చదువుతూనే ఉండాలి. కోపముగాని, అసూయాభావముకాని, విరక్తి భావముకాని అధ్యాపకులలో ఉంటే కొన్ని వేలమంది విద్యార్థులు పాడైపోతారు. ఈనాడు విద్యార్థులు ఈ విధమైన వికారమార్గము, అవినీతి మార్గము పట్టుటకు అధ్యాపకులే మూల కారణమని చెప్పక తప్పదు. కనుక అధ్యాపకులు మొదట ఉత్తమమైన భావములను చిత్తములో అభివృద్ధి పరచుకోవాలి. ఆదర్శవంతమైన జీవితాన్ని గడపాలి.

## సంస్కారము

లోక సంబంధమైన విద్యలుకూడా అవసరమే. అయితే చదువునకు తగిన సంస్కారం కూడా అత్యవసరం. సంస్కారంలేని చదువు చదువుకాదు. చెత్తవంటిది. సంస్కారము కరెంటు వంటిది. అది పాజిటివ్. విద్య బల్బువంటిది. అది నెగిటివ్. ఈ పాజిటివ్, నెగిటివ్‌లు రెండూ చేరినప్పుడే ఉపయోగము. భారతీయ సంస్కృతి అనే కరెంటును భద్రమైనదిగా, పవిత్రమైనదిగా పోషించుకొనుటకు పూనుకోవాలి. భారత దేశము యొక్క పవిత్రతను, శీలము యొక్క తత్త్వమును, యుగ యుగములనుండి కాపాడుతూ వచ్చినట్టి సంస్కృతిని ఈనాడు అలక్ష్యము చేయుచున్నారు. ఇది అత్యంత ప్రమాదం. దురభ్యాసములకు మన విద్యార్థులు లోను కాకూడదు. జీవితమును, నియమ నిష్ఠలను నాశనము చేసేది దురభ్యాసములే. ఈనాడు మానవుని గౌరవము దురభ్యాసములతోనే పాడైపోతున్నది. కనుక మా-న-వ ఈ మూడిటికి తగిన పవిత్రతను సాధించుకోవాలి. మా = అజ్ఞానము; న = లేకుండా; వ = వర్తించుట. అజ్ఞానము లేకుండా వర్తించేవాడే మానవుడు. దీనిని పురస్కరించుకొని "Death is sweeter than the blindness of ignorance" అజ్ఞానపు గ్రుడ్డి తనము కన్న మృత్యువు మధురతరము అన్నారు. కనుక గౌరవనీయమైన దుస్తులు ధరించి పవిత్ర హృదయముతో పెద్దలకు సేవచేసి గౌరవించినప్పుడే భారత దేశమునకు తగిన పుత్రులుగా మీరు తయారవుతారు. వినయంతో నీవు నిరంతరం దేశమునకు సేవచేయాలి. కాని నాయకుడు కావటానికి ప్రాకులాడకు. Duty is God విద్యుక్త కర్మయే భగవంతుడు. Work is worship శ్రమయే ఆరాధన. ఈ రెండు నేత్రములను నీవు మూసి కొంటివా? నీవు విద్యార్థివి కావు.

## సోమరితనం

" Laziness is Rust and dust
Realisation is best and rest "

సోమరి తనమే చిలుము, ధూళి! ఆత్మసాక్షాత్కారమే ఉత్తమము, విశ్రాంతి. ఈ విషయాన్ని మరువకండి. ఈనాడు విద్యార్థులు పండ్లు తోముకొనుటకు, తన ముఖమును కడుగుకొనుటకు బద్ధకము వచ్చి సోమరిపోతులవుతున్నారు. దుస్తులు పాతవైనా ఫరవాలేదు. శుభ్రముగా ఉతుక్కొని కట్టుకోవటం నేర్చుకోవాలి. తన దుస్తులను, తన శరీరమునే శుభ్రముగా ఉంచుకోని సోమరిపోతు దేశాన్ని ఏమి పరిశుభ్రపరచగలడు ? రెండు నెలలైనా స్నానము చేయని విద్యార్థులు కూడా ఉన్నారు. ఇట్టి విద్యార్థులు దేశమునకు ఏ విధమైన ఆదర్శమును అందించగలరు ? ఏ ఉద్దేశ్యమును చాటగలరు ?

## విద్యార్థులారా !

మీరు పవిత్ర హృదయము కలవారు. యువకులుగా ఉన్నప్పుడు రాజకీయములలో ప్రవేశించకండి. మీరు పెద్దవారై కొంత అనుభవము వచ్చిన తరువాత రాజకీయాల్లో పాల్గొని తప్పక సేవ చేయండి. విద్యకు భంగము రాని మార్గమును మీరు అనుసరించాలి. విద్యార్థులుగా ఉన్నప్పుడే రాజకీయాలలో చేరితె విద్య నశ్యించుటకు వీలుండదు. అక్కడ దేశసేవ చేయుటకు అవకాశం ఉండదు. దేశ సేవకుడూ కాక విద్యార్థికాక ఉభయ భ్రష్టత్వము, ఉపరి సన్యాసముగా ఉంటుంది. నీవు విద్యార్జన చేసే కాలమున విద్యార్థిగానే ఉండాలి కాని విషయార్థివి కారాదు. ఆచరణ ముఖ్యం. కాలము వ్యర్థము గావించకుండా ఏ క్షణములోనైనా సమాజసేవ చేయుటకు కంకణం కట్టుకోవలెనని ఆశిస్తున్నాము. ★




1. 'ఛీఫ్ జస్టిస్ ఆఫ్ ఇండియా' యొక్క రిటైర్మెంట్ వయస్సు ఎంత ?
2. బాగ్దాద్ నగరము ఏ నది ఒడ్డున ఉన్నది ?
3. బంగారం ఎక్కువగా ఎగుమతి చేసే దేశమేది?
4. పనామా కాలువ వల్ల న్యూయార్క్, శాన్ ఫ్రాన్సిస్కో నగరాల మధ్య ఎంత దూరం తగ్గినది ?
5. న్యూజిలాండ్ దేశపు రాజధాని ఏది ?
6. 'కాన్‌స్టాంటి నోపుల్' నగరము యొక్క కొత్త పేరు ఏమిటి ?
7. ప్రపంచంలో కెల్లా ఎత్తైన విగ్రహం ఎక్కడ ఉన్నది ?
8. ' గార్డెన్ ఆఫ్ సౌత్ ఇండియా ' గా పేర్గాంచిన నగరమేది ?
9. మిక్కిలి తెలివి గల జంతువేది ?
10. ఉత్తరము నుంచి దక్షిణానికి ఇండియా విస్తరించి ఉన్న దూరమెంత ?
11. U F O అంటే ఏమిటి ?
12. ' ఎన్సెఫిలైటిస్ ' వ్యాధి వల్ల శరీరంలో దెబ్బతినే భాగమేది ?

1. 65 సం॥ 2. టైగ్రిస్ నది 3. దక్షిణాఫ్రికా 4. 9000 మైళ్లు 5. వెల్లింగ్ టన్ 6. ఇస్తాంబుల్ 7. న్యూయార్క్‌లోని స్టాట్యూ ఆఫ్ లిబర్టీ 8. తంజావూరు 9. చింపాంజీ 10. 3219 కి॥మీ 11. అన్ ఐడెంటిఫైడ్ ఫ్లయింగ్ ఆబ్జెక్ట్ 12. మెదడు

# లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ్

" స్వేచ్ఛ అంటే మానవుని వ్యక్తిత్వమునకు స్వేచ్ఛ, మనస్సుకు స్వేచ్ఛ, భావమునకు స్వేచ్ఛ అని అర్థము. అట్టి స్వేచ్ఛయే, నాకు నా జీవిత పరమావధి, నా జీవిత ఆకాంక్ష అయివున్నది. అట్టి పవిత్రమైన దానిని, నేను రొట్టె కోసమో, అధికారం కోసమో, భద్రతకోసమో, నా వ్యక్తిగత అభివృద్ధి కోసమో, రాజ్యవైభవం కోసమో, లేదా మరి ఏవిధమైన నీతి బాహ్యమైన స్వార్థము కోసమైనా సరే రాజీపడి దానిని త్యజించ జాలను. "

కొమఱ్ఱిగిరి కృష్ణమోహనరావు

అని లోకనాయక్ జయప్రకాశ్‌నారాయణ నిశ్చయంగా, స్పష్టంగా తన భావాలను వెలిబుచ్చారు. తన జీవితంలో ఎన్నడూ, ఎప్పుడూ అధికారంకోసం తాపత్రయ పడలేదు. నమ్మిన సిద్ధాంతం కోసం జీవితాంతం పోరాటం కొనసాగించిన మహాయోధుడు. ఎన్నికలలో పోటీ చేయలేదు. రాజకీయ అధికారాన్ని చేపట్టాలనే ఆకాంక్ష ఆయనకు ఉండేదికాదు. అధికారాన్ని పొందినవారికన్నా ఎక్కువ పేరు ప్రతిష్ఠలను పొందిన ప్రజానాయకుడు. అధికారం లేకపోయినా ప్రజల సహకారం మాత్రం అందరికన్నా ఎక్కువగా సంపాదించగలిగారు. స్వాతంత్ర్యమునకు పూర్వం నాయకుడు కావటం తేలిక. స్వాతంత్ర్యము తరువాత ప్రజానాయకుడుగా, అందరిచేత మన్ననలను పొందిన ఏకైక నాయకుడు జయప్రకాశ్ నారాయణ మాత్రమే. స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో ప్రజానాయకుడు మహాత్మా గాంధీజీ అయితే, స్వాతంత్ర్యం తరువాత ప్రజానాయకుడుగా అంతటి పేరు ప్రతిష్ఠలను సంపాదించుకొనిన వ్యక్తి లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ్ మాత్రమే. స్వాతంత్ర్యాన్ని తెచ్చిన ఘనత మహాత్మా గాంధీజీకి దక్కితే, దానిని నిలబెట్టిన ఘనత జయప్రకాశ్‌కు దక్కింది.

మన దేశంలో సహజంగా చాలామంది నాయకులకు, ప్రజలకు ఒక అభిప్రాయం ఉన్నది. అధికారంలో వుంటేనే ప్రజాసేవ చేయగలుగుతామని, ప్రజలకు కావలసిన పనులు చేసిపెట్టటానికి అవకాశం వుంటుందనే అభిప్రాయం చాలామందిలో పాతుకొనిపోయింది. అంతేకాదు – అధికారంలో వున్నవారికే గౌరవం పేరు ప్రతిష్ఠలుంటాయని, వారినే సమాజం గుర్తిస్తుందని, వారినే అభినందిస్తారని పూలమాలలతో నింపి సన్మానిస్తారనీ సహజంగా సామాన్యుడు భావిస్తుంటాడు. ఇందులో కొంత యదార్థం కూడా వున్నమాట వాస్తవమే. ప్రస్తుత స్వార్థ పూరితమైన సమాజం ఆవిధంగానే నడుస్తున్నది. ఏమాత్రం అర్హతలు లేనివాడు, సంస్కారవిహీనుడు, దుర్గుణ సంపన్నుడు, అవినీతి కింగ్, హంతకుడు సహితం దురదృష్టవశాత్తు మంత్రి పదవిని గనుక అలంకరించడం సంభవిస్తే, అతనికి భజనచేసే భజనపరులు కూడా కోకొల్లలుగా కనిపిస్తున్నారు. ఇది నేనాటి దురవస్థ. మనం చిన్నప్పుడు ఒక నీతి శ్లోకం చదువుకున్నాం. దానిని మరల ఇప్పుడు చదువుకుంటే రానున్న సమాజాన్ని మన పూర్వీకులు ముందుగానే గ్రహించి, ఊహించారనే విషయం స్పష్టమవుతున్నది.

" స్వదేశే పూజ్యతే రాజా
స్వగ్రామే పూజ్యతే ప్రభుః
స్వగృహే పూజ్యతే మూర్ఖః
విద్వాన్ సర్వత్ర పూజ్యతే "

పై శ్లోకం ఎంతో అనుభవంతో మన పెద్దలు చెప్పారు. అధికారానికి భయపడి సామాన్యులు తలవంచ

టం పరిపాటి. అధికారాన్ని ధిక్కరిస్తే అవస్థ పడవలసి వస్తుందేమోననే భయం. పనులు చేయించుకోవటం కష్ట మని భావించి భజన చేయటానికి అలవాటు పడ్డారు చాలామంది. అయితే అధికారం వున్నంత వరకే అట్టి వారికి గౌరవం లభిస్తుంది, అధికారం పోయిన తరువాత పలుకరించే దిక్కువుండదు. అట్టివారిని ప్రజానాయకు లనరు. అసలు సిసలైన ప్రజానాయకుడు విద్యాంసుడు లాంటివాడు. అతనికి అధికారాలు అవసరం లేదు. అతని లోని మంచితనం, సుగుణ సంపత్తి, నిస్వార్థసేవ, త్యాగం, ప్రేమ కరుణలు మాత్రమే ప్రజల ఆదరాభి మానములను చూరగొనటానికి కారణము లవుతాయి. అట్టివారు ప్రజలచేత ఆత్మీయతతో గౌరవించబడుతారు, పూజింపబడుతారు. ప్రస్తుత ప్రజాస్వామ్య యుగంలో మనదేశంలో ఆ కోవకు చెందినవారు ఇద్దరే ఇద్దరు, ఒకరు స్వాతంత్ర్య సమరంలో మహోద్యమాన్ని నడిపి రవి అస్తమించని సామ్రాజ్యాన్ని కూకటి వేళ్ళతో పెకళించివేయటానికి ప్రజా ఉద్యమాన్ని నడిపి తెల్లదొరలను పారద్రోలిన మహాత్మాగాంధీజీ అయితే, మరొకరు మనదేశంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యములు మృగ్య మవుతున్న తరుణంలో ప్రజాపోరాటానికి పిలుపు నిచ్చి, విప్లవ శంఖాన్ని పూరించి, ప్రజలను చైతన్య వంతులను గావించి, మహోద్యమాన్ని నడిపి తిరిగి భారత్‌లో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను నిలబెట్టిన యోధుడు లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ్.

ఆనాడు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మహాత్మా గాంధీజీ అధికారం కావాలనుకుంటే మన దేశంలో అత్యున్నతమైన పదవే ఆయనకు లభించి వుండేది. అదే విధముగా జయప్రకాశ్ కూడా ప్రథమ కేంద్రమంత్రి వర్గంలో చేరి వుండినట్లయితే పండిత నెహ్రూ తరువాత భారత ప్రధాని అయి వుండేవారనటంలో ఏమాత్రం సందేహంలేదు. ఈ ఇద్దరు ప్రజానాయకులు అధికారాన్ని ఏమాత్రం ఆశించకుండా, నిస్వార్థంగా ఉద్యమాలను నిర్వహించారు కాబట్టే వారి కీర్తి ప్రతిష్ఠలు చిరస్థాయిగా నిలిచిపోయాయి. చరిత్రలో సువర్ణాక్షరములతో వారి త్యాగమయమయిన చరిత్రలు లిఖించబడి తరతరాల వారికి స్ఫూర్తినిస్తుంటాయి.



లోకనాయక్ జయప్రకాశ్‌నారాయణ్‌తో కొమరగిరి

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మహాత్మాజీ ఒక విషయం చెప్పారు. 'హరిజన్' అనే పత్రికలో స్పష్టంగా వ్రాశారు. స్వాతంత్ర్య సమరంలో ఉద్య మాన్ని నిర్వహించిన జాతీయ కాంగ్రెసును రద్దు చేయ మని గాంధీజీ కోరారు. "లోకసేవక సంఘమును స్థాపించుతాను, దానిలో చేరి ప్రజా సేవ చేయండి. కాంగ్రెసును మాత్రం రద్దు చేయండి. రద్దు చేయని యెడల పవిత్ర చరిత్ర కలిగిన కాంగ్రెసు కొంతకాలానికి స్వార్థపరుల చేతులలోనికి పోయి అపఖ్యాతిపాలవుతుంది. ఈనాటి కాంగ్రెసు అది ఒక మహోద్యమం. దేశ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న వారందరికి ఆశ్రయమిచ్చిన ఒక జాతీయమహాసంస్థ. స్వాతంత్ర్యం తెచ్చిన ఘనత ఈ మహా సంస్థకు దక్కింది. అది చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోవాలంటే ఈ మహా

“ నాకు హింసలో నమ్మకంలేదు. ఎందు కంటే నేను ప్రజాస్వామ్యమును నమ్ముతాను కనుక. ప్రజలలో నమ్మకం లేనటువంటివారే ప్రజల విశ్వాసాన్ని పొందలేనటువంటివారే హింసలోనికి దిగుతారు. ప్రజల శక్తి సంఘటితమైనచోట హింస అవవసరం. ప్రజల శక్తి సంఘటితం కానప్పుడు వచ్చే హింస చాలా క్రూరంగా ఉంటుంది. తుపాకులు భుజాన వేసుకున్నవాళ్ళు, ప్రజల భుజాలమీద కెక్కాలనీ, ప్రజల పేరు మీద వారు రాజ్యం చేయాలని నేను కోరను. ”

— శ్రీ జయప్రకాశ్ నారాయణ్

సంస్థను రద్దు చేయటం సముచితం. అది చేయనియెడల ఏ ప్రజలైతే ఈ మహా సంస్థను ఈనాడు గౌరవిస్తున్నారో ! ఆ సంస్థ కొంతకాలానికి స్వార్థపరుల చేతులలో పడినప్పుడు, పొగిడిన ప్రజలే తిరిగి దూషించేరోజు వచ్చినా ఆశ్చర్యపడనవసరం లేదు. దురదృష్టవశాత్తు ఆనాడు నేనుంటే బాధ పడవలసివస్తుంది. పోతే నా ఆత్మ సంక్షోభిస్తుంది. కనుక అటువంటి స్థితికి దిగజారక మునుపే ఈ మహా సంస్థను రద్దుచేసి దాని గౌరవ ప్రతిష్ఠలను చిరస్థాయిలో చరిత్రలో నిలిచే విధంగా చేయండి.” అని గాంధీజీ హితవుచెప్పారు. నెహ్రూ, పటేల్ లాంటి మహానాయకులే గాంధీజీ మాటలను ఆమోదించలేదు. చిట్టచివరికి ఈనాడు మహాత్మాజీ ఊహించిన రీతిలోనే జరిగింది.

లోకనాయక్ జయప్రకాష్ కృషి ఫలితమే ఆనాటి జనతాపార్టీ ప్రభుత్వ ఆవిర్భావం. 1977 మార్చి 16 న జరిగిన లోకసభ ఎన్నికలలో జయప్రకాష్ తన జీవితంలో మొదటిసారిగా ఓటు చేసారు. దేశంలో నియంతృత్వానికి చరమ గీతం ఆలపించిన శుభదినమది. ప్రజలు చారిత్రాత్మకమైన తీర్పు నిచ్చిన శుభగడియ అది. 1977 సం. మార్చి 21న దేశంలో అత్యయిక పరిస్థితి ఎత్తివేయ బడింది. ప్రజలు స్వేచ్ఛావాయువులను పీల్చుకొన్నారు. 1977 మార్చి 24 వ తేదీన ఢిల్లీలో రాజఘాట్‌లోని మహాత్మాగాంధీజీ సమాధి వద్ద ఆనాడు ఎన్నికైన జనతా పార్టీ లోక్‌సభ సభ్యులు జయప్రకాష్ సమక్షంలో దేశ సేవకు అంకితమవుతామని, సమైక్య కృషిని కొనసాగించి భారత సమైక్యతను, సమగ్రతను కాపాడి, దేశప్రగతికి కృషి చేస్తామని, ప్రజాస్వామ్య పరిరక్షణకు సమైక్య పోరాటం కొనసాగిస్తామని ప్రతిజ్ఞచేసారు. 18నెలలపాటు ప్రతిజ్ఞను జ్ఞప్తియందుంచుకొని సమైక్యంగా పాలించారు జనతానాయకులు. రాను రాను స్వార్థం, సంకుచితత్వం. అధికార వ్యామోహం, పాతవాసనలు తలఎత్త ప్రారంభించాయి. ఒకరిని చూస్తే మరొకరికి అనుమానం, ఓర్వ లేని తనం పెచ్చురేగాయి. అనుమానం పెనుభూత మయింది. జనతా ప్రభుత్వం బ్రద్దలు కావటం ప్రారంభమైంది. అదే విధంగా జయప్రకాష్ ఆరోగ్యం కూడ క్షీణిస్తూవచ్చింది. వైద్యుల ప్రయత్నాలు సఫలీకృతం కాలేదు. తన కళ్ళ ఎదుటనే జనతా నాయకుల కీచులాటలు చూడవలసిన దుస్థితి ఏర్పడింది. ఒక ప్రక్క మృత్యువు వెంటాడుతుంటే, మరొక ప్రక్క స్వార్థపరులైన జనతా నాయకుల కుట్రలు, కుతంత్రాలు జయప్రకాశ్‌ను బాధించసాగాయి. ఈ విపత్కర పరిస్థితులను చూడలేక 1979 అక్టోబర్ 8వ తేదిన జయప్రకాశ్ శాశ్వతంగా కన్నుమూయటం జరిగింది.

నిస్వార్థంగా త్యాగం చేసిన ఈ ఇద్దరు జాతీయ ( మహాత్మాగాంధీ, జయప్రకాశ్ ) మహానాయకులు వారి, వారి అనుచరులచేత ఒక విధంగా అన్యాయం చేయ బడ్డారు. కొంతమంది మహాత్మాగాంధీజి పేరును, మరి కొంతమంది జయప్రకాశ్ నారాయణ్ పేరును వారి వారి అవసరాలకు ఉపయోగించుకుంటున్నారు గాని వారి ఆశలు ఆదర్శములను మాత్రం ఆచరణలో పెట్టడానికి ముందుకు రావటం లేదు. ఇది ఈనాటి పరిస్థితి, మనదేశం యొక్క దుస్థితి. ఇది ఏ నాటికి మారుతుందో ! మారినా, మారక పోయినా ఒకటి మాత్రం ఖాయం. ఈ ఇరువురి ఆత్మలు మాత్రం సంక్షోభిస్తుంటాయి.

# భగవదనుగ్రహం వలన ప్రారబ్ధానుభవ తీవ్రత తగ్గును

**జీవునకు** దుఃఖము శరీర పరిగ్రహణము వలన కలిగినది. శరీరము అంగీకరించుటకు కర్మ యేకారణము. కర్మ రాగాదుల వలన ; రాగాదులు, అవివేకము వలన ; అవివేకము అజ్ఞానము వలన కలుగుచున్నవి. అజ్ఞానము అనాది. అస్తి నాస్తి విచికిత్సా హేతువైనది.

జీవుని జన్మాంతర కర్మయే యీ జన్మకు కారణము. తాను చేసిన సుకృత, దుష్కృతములను అనుసరించియే జీవికి జన్మ పరంపర కలుగుచున్నది.

" కర్మమునఁ బుట్టు జంతువు
కర్మముననే వృద్ధిపొందు కర్మమునఁజెడున్ "

ఈశ్వరార్పణముగా నాచరించిన కర్మ మోహక్షయ హేతువేను. అట్టి కర్మిష్ఠి భవబంధములందు జిక్కుకొనడు. ఫలమపేక్షించి చేసిన కర్మ " అగామి, సంచితము, ప్రారబ్ధము" అని ముప్విధముల చెప్పుదురు. " అగామి " ముందు రాబోవు జన్మకు కారణమగును. అది సుకృతమైన రాబోవునది ఉత్తమ జన్మమును, దుష్కృతమైన హీన జన్మము లభించును. ఈ జన్మలో మానవుడు కర్తృత్వభోక్తృత్వాహంకారము లేకుండా కర్మల నాచరించిన "అగామి" నశించును. 'సంచితము' రాబోవు అనేక జన్మలకు సహాయకారిగా నుండును. దాచిన వస్తువు వంటిది. ఈ సంచితము జ్ఞానముచే నశించును. ఇక " ప్రారబ్ధము " ఇప్పుడున్న దేహమే యగును. దీని ననుభవించి తీరవలసినదే. ఈ దేహ మందులకే గ్రహింపబడినది. దేహముండు వరకును ప్రారబ్ధముండును. దేహముతోనే ఇది నశించును. అందుకే శ్రీ బాబావారు ....

" బ్రహ్మ నీ కిచ్చి పంపిన బరువుమాల
కర్మలన్నియుఁ జేర్చిన కంఠమాల " అంటారు.

" ప్రారబ్ధము " వండుకొని భుజించుటకు నోట బెట్టుకొనుచున్న అహారము వంటిది. వదలిన బాణము వంటిది. దీని నెవ్వరును తప్పింపలేరు. శ్రీ శంకరాచార్య, శ్రీ రామకృష్ణపరమహంసలు సయితం కొంత వరకు అనుభవింపక తప్పలేదు. కాని వారికి దేహ భ్రాంతి లేదు. అయిన భగవద్భక్తి వలన వచ్చే లాభ మేమి ? మానవుడు సత్కర్మాచరణశీలుడై అనన్య భక్తియుతుడైయున్నచో భగవదనుగ్రహమును పొందును. ప్రారబ్ధానుభవముయొక్క తీవ్రత తగ్గును.

**శిష్టా సూర్యనారాయణమూర్తి**

అనుభవించుటకు అవసరమైన, అసాధారణ దివ్య శక్తి కలుగును. అప్పుడా భక్తుడు ప్రారబ్ధదుఃఖితుడు గాక భగవత్కృపచే రక్షింపబడితినని ఎరుక కలిగి సంపూర్ణ జ్ఞాన భక్తుడు కాగలడు.

## బాబా అనుగ్రహం

శ్రీ రామ, శ్రీ కృష్ణ, శ్రీ షిరిడీ సాయి అవతారములలో వలె శ్రీ సత్యసాయిబాబావారును ప్రారబ్ధ విషయమున భక్తుల నాదుకొని యనుగ్రహించిన సంఘటనలు అనేకం. ఒక సంవత్సరం దసరా ఉత్సవములకు అమలాపురంనుండి రెండు బస్సులలో భక్తులు ప్రశాంతి నిలయమునకు పయనమైరి. మొదటి బస్సు సురక్షితముగా ప్రశాంతి నిలయం చేరింది. తరువాత బయలు దేరిన బస్సు మధ్యలో ప్రమాదమునకు గురైనది.

## ఆంధ్ర గ్రంథములు – రచయితలు

| | |
|---|---|
| కావ్యాలంకార చూడామణి | – విన్నకోట పెద్దన |
| కాశీ ఖండము | – శ్రీనాథుడు |
| కుమార సంభవము | – నన్నెచోడుడు |
| దశకుమార చరిత్ర | – కేతన |
| నిర్వచనోత్తర రామాయణము | – తిక్కన |
| నృసింహ పురాణము | – ఎఱ్ఱన |
| నైషధము | – శ్రీ |
| నవనాథ చరిత్ర | – గౌరన |
| పంచతంత్రము | – దూబకుంట నారాయణకవి |
| పండితారాధ్య చరిత్ర | – పాల్కురికి సోమన |

ప్రాతఃకాలసమయమున బాబాగారు అమలాపురం భక్తులను పిలిచి "మీ ఊరినుండి వచ్చే రెండవబస్సు అనంతపురం సమీపమున ఒక వాగు దగ్గర తెల్లవారు జామున బోల్తాపడినది. బస్సు బాగా దెబ్బ తిన్నది, బస్సులోని భక్తులకేమీ ప్రమాదం కలుగకుండా కాపాడాను. 90 గజాల లోతులో పడవలసిన వాళ్ళను 9 అంగుళాల లోతులో పడేటట్లు చేసి ప్రమాదం తప్పించాను. ప్రారబ్ధం కొంతైనా అనుభవించక తప్పదుగదా ! వాళ్ళ భక్తి విశ్వాసాలే వాళ్ళను కాపాడినవి. వాళ్ళు ఒక లారీలో సురక్షితంగా 10 గంటలకు వస్తారు. కావలసిన ఏర్పాట్లు చూడండి." అని చెప్పారు. శ్రీవారి అనుగ్రహంతో వారంతా 10 గంటలకు ప్రశాంతినిలయం చేరారు.

జరిగిన సంఘటనను గురించి ఆ బస్సు ప్రయాణీకులను విచారించగా ఆశ్చర్యకరమైన విషయాలు చెప్పారు. ఆనాడు తెల్లవారుజామున 4 గంటల ప్రాంతంలో ఆ బస్సు అనంతపురం వద్ద ఒక వాగు దగ్గరకు వచ్చింది. చాలామంది గాఢ నిద్రలో వున్నారు. ఒక్కసారిగా బస్సు నీటిలో దిగటంతోనే పెద్ద శబ్దం చేసి తలక్రిందులైపోయినది. గాఢాంధకారం. బస్సులోని భక్తులంతా "సాయిరామా ! సాయిభగవాన్" అని ఆక్రందన చేయసాగారు. ఇంతలో ఎవరో వారికొరకే పంపినట్లుగా ఒక లారీ వచ్చింది, ఆ లారీ వైట్ల సహాయంతో ప్రయాణీకులు బయటకు వచ్చి లారీలో సురక్షితంగా ప్రశాంతినిలయం చేరారు. ప్రమాదానికి గురియైన బస్సు ఇంజను బద్దలైనది, బస్సు పూర్తిగా ధ్వంసమైంది. ఆ బస్సును చూచినవారికి ఆశ్చర్యం వేయక తప్పదు. అందులోని ప్రయాణీకులు బయటపడటం దుర్లభం. కేవలం బాబావారి అనుగ్రహము వలననే ఆ ప్రయాణీకులు రక్షింపబడ్డారనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

నా మిత్రుడొకడు తీవ్రమైన శిరోవేదనలో బాధ పడుచుండెడివాడు. అప్పటికి కొన్ని సంవత్సరములనుండి శ్రీ సాయిరాముని సన్నిధికి వచ్చుచున్నాడు. విజయదశమినాడు, యజ్ఞానంతరము కలశోదకమును శ్రీవారు భక్తులందరిపై స్వయముగా చల్లుట పరిపాటి. ఆనాడు పవిత్రోదకమును చల్లె కూర్చి (దర్భలకట్ట) ని వాని తలకు తాకించిరి. అదియే అతనికి వరప్రసాదమైంది. అప్పటినుండి అతడు తలపోటు బాధనుండి విముక్తుడైనాడు.

ఈ విధంగా బాబావారు ఎంతోమంది భక్తులకు తమ అనుగ్రహమును ప్రసాదిస్తుంటారు. జీవితమంతా అనుభవించవలసిన బాధలయొక్క తీవ్రతను తగ్గించి, దానిని కూడా కొలది కాలము మాత్రమే అనుభవింపజేసి ప్రారబ్ధ ప్రభావమును తగ్గించివేస్తుంటారు. బాధలనుండి విముక్తిని ప్రసాదిస్తుంటారు,

ఒకప్పుడు బాబాగారే స్వయంగా "పూర్వజన్మ యొక్క కర్మ ఈ జన్మలో అనుభవించవలసియుటుందని, ఎంతటి భగవదనుగ్రహం కూడా వాటినుంచి మానవుని రక్షించలేదని మీరు చెప్పవచ్చును. ఈ కర్మలనుంచి బాధపడనక్కరలేదని నిశ్చయముగా నేను మీకు చెప్పుచున్నాను. వైద్యుడు "మార్ఫిన్" ఇంజక్షను నిచ్చి ఎలా బాధను అనుభవించకుండా చేస్తాడో, భగవదనుగ్రహము కూడా మీ కర్మల బారినుండి తప్పించి మీ కా

బాధలనుంచి విముక్తుని చేయును. మందులకు ఎక్స్పైరీడేటు దాటితే వాటి శక్తి కోల్పోతాయి. అలాగే కర్మ దోషాలున్నా, వాటియొక్క ప్రభావము కోల్పోతాయి. భగవంతుడు మానవుని కర్మ దోషాల నుంచి పూర్తిగా రక్షించగలడు. కొన్ని రోజుల క్రితం, గురుపూర్ణిమ దగ్గరలో ఒక భక్తుని పక్షవాతము గుండె పోటును నేను స్వయముగా తీసుకొని రక్షించాను. లలాట లిఖితాన్ని చెరుపుట దుర్లభమని, పూర్వజన్మ కర్మలను ఈ జన్మలో అనుభవించాలనుట చాలా తప్పు. అనుగ్రహము వీటినన్నిటినీ తుడిచిపెట్టివేయును. దానికి తిరుగు లేదు, అది భగవదనుగ్రహము అని గ్రహించాలి." అని చెప్పారు.

భగవదనుగ్రహం లభించుట అంత తేలిక కాదు. భక్తులయొక్క అనన్యభక్తిపై అది ఆధారపడివుంటుంది. రెండక్షరాల బి. ఏ. డిగ్రీ సంపాదించటానికి బాలబాలికలు ఎన్నో సంవత్సరాలు కృషి చేయవలసివస్తున్నది. లౌకిక విషయాలలో ఉండే శ్రద్ధాసక్తులు, ఆధ్యాత్మిక విషయాలలో అభివృద్ధికావటంలేదు. అత్యల్పమైన భౌతిక విషయాలను సాధించటానికి ఎంతో కృషిచేస్తున్నాము. శాశ్వతమైన, నిత్యసత్యమైన భగవదనుగ్రహమును సంపాదించటానికి ఇంకా ఎంత కృషి చేయాలో ఆలోచించండి. కనుక ప్రతిఒక్కరు భగవదనుగ్రహమును సంపాదించటానికి కృషి సలిపి ప్రారబ్ధానుభవము యొక్క తీవ్రతను తగ్గించుకొనేందుకు ప్రయత్నించాలి.




# నాస

## ( PINE - APPLE )

ఇది గజమెత్తు వరకు పెరిగే పట్టజాతి మొక్క. ఈ మొక్క ఆంధ్రరాష్ట్రములో సింహాచలం కొండపైన దిగువను విస్తారముగా పైరగును. ఇది నీటి వసతి స్థలములలో పెరుగును. పట్టలే దీని ఆకులు. పట్ట 3 అంగుళముల వెడల్పు కలిగి సుమారు 2 మూరలు పొడవుండును. పట్టల అంచు చుట్టునూ చిన్న చిన్న ముండ్లుండును. కాయ దీని మొవ్వునుండి వెలువడును. ఒక్కొక్క మొక్క ఒక్కొక్క కాయ కాసి తదుపరి ఎండిపోవును. కాయ ఆకుపచ్చగా నుండును. పండిన ఎరుపు, పసుపు కలిసిన రంగుండును. కాయపైన గదులు గదులు గల మచ్చలుండును. పండు కొనన గుజ్జుగల మొక్క యుండును. ఇదియే దీని విత్తనము.

ఇది పుల్లపు, తీపి రుచి కలిగియుండును. విపాకమున తీపిరుచిగా మారును.

వైద్యములో దీనికి స్థానము లేకపోయిననూ ఈ పండు తిననందువలన కొన్ని ఫలితములు మనకు లభించగలవు.

శ్రమనడంచి దప్పిని పోగొట్టును. మేహశాంతి నిచ్చి అరోచకమును పోగొట్టును. పండుపై చర్మమును కోసి, ఉప్పుతో బాగుగా కడిగి, ముక్కలు కోసి తినవలెను. పచ్చికాయ అజీర్ణకారి. పైత్య శ్లేష్మాదులను పెంచును.

అనాస పండును గర్భిణీ స్త్రీలు తినరాదు. తినిన 24 గంటల పిదప తప్పక గర్భస్రావమగునని బెంగాల్‌లో కొందరు డాక్టర్లు పరిశోధించి తెలిపారు. పచ్చికాయల రసమునకు ఈ శక్తి మిక్కిలి హెచ్చు. పచ్చికాయల రసములో ఉప్పు కలిపి త్రాగిన 24 గంటలలో గర్భస్రావమగును.

నవీన పరిశోధన ప్రకారం దీనిలో Phosphoric, Sulphuric Acids, Lime-Magnesea, Silica, Iron, Sodium మొదలగునవి ఉన్నట్లు తెలిసింది.

— యస్. యన్. దుర్గారావు

# ఇది ఆ వుల విధానం

**గాలిలో** ఎగిరే పురుగులు, నీళ్లలో నివసించే చేపలు, నేలమీద తిరుగాడే జంతువులు జత కట్టడం ప్రకృతిసిద్ధంగా అనాదిగా వస్తోంది. అవి జత కట్టే విధానాలని పరిశీలించిన పాశ్చాత్య సైంటిస్టులు ఆశ్చర్య కరమయిన విషయాలని కనుగొన్నారు.

ఓ రకం కీటకం అంతదాకా మరో మొగ కీటకంతో జత కట్టని కన్య అయిన ఆడకీటకాన్ని వెతుకుతుంది. మైలు దూరంలో వున్నా సరే ఎగిరి వెళ్తుంది దాని దగ్గరకి, కళ్ళు కనబడని చీకటిలో కూడా. ఆ అడ కీటకం నుంచి వెదజల్లబడే ఓ రకం వాసనని బట్టి అది కన్య అని గ్రహించి ఆ వాసన వెంట వెళుతుంది.

## మనకు తెలియని ప్రపంచం

### మల్లాది వెంకటకృష్ణమూర్తి

మిణుగురు పురుగులు కొన్ని వందలు కలసి ఒకే చోట జీవిస్తుంటాయి. మొగపురుగు ఓ ప్రత్యేకమయిన రీతిలో రెక్కలు అప్పి కాంతి వెదజల్లుతుంది. అది గమనించిన ఆడపురుగు అదే విధంగా రెక్కలు కదిపి కాంతిని ప్రసారంచేస్తుంది, సరిగ్గా రెండు క్షణాల వ్యవధి తర్వాత. దాన్ని గమనించి మొగపురుగు తిరిగి అదే విధంగా కాంతి సందేశం పంపుతుంది సరిగ్గా రెండు క్షణాల తర్వాత. ఈ విధంగా రెండు క్షణాల వ్యవధిలో మొగ ఆడ ఒకోరకం కాంతి సందేశం పంపుతూ దగ్గరకి చేరుకుంటాయి. ఆ రెంటిలో ఏదైనా కాంతి సందేశం రెండు క్షణాలలో పంపక ఆలస్యం చేస్తే రెండోది ఇక మొదటిదాన్ని పట్టించుకోదు.

మొగపాము మరో పాము కనబడితే రాచుకుంటూ పోతుంది. అది కూడా మొగపామయినా లేక మరో జాతికి చెందిన సర్పమయినా క్షణాలలో అక్కడ్నుంచి మాయమవుతుంది. ఆడదయితే జత కడుతుంది.

సముద్రపు గుర్రాలలో మొగగుర్రం వంటిమీద ఓ సంచీలాంటిది వుంటుంది. ఆడగుర్రం అందులో గుడ్లు పెడితే మొగగుర్రం వాటిని పొదిగి పిల్లలు పెడుతుంది. మొగ గుర్రం వంటికుండే సంచీలో అనేక ఆడ గుర్రాలు గుడ్లు పెడతాయి కాబట్టి ఎవరు తల్లో తెలుసుకోవటం అసాధ్యం.

అమెరికాలోని గోధుమ రంగు గబ్బిలాలు చలి కాలంలో జతకడితే, తన వంట్లోకి వచ్చిన వీర్యాన్ని ఆడగబ్బిలం ఎండాకాలం వచ్చేదాకా భద్రపరచి ఆ తర్వాతే తనకి గర్భం వచ్చేలా చేస్తుంది. ప్రపంచంలోని మరే ప్రాణి వీర్యాన్ని 36 గంటలకంటె ఎక్కువ కాలం వుపయోగకరంగా నిలవచేయలేదు.

నత్తలో మొగ ఆడ జననేంద్రియాలు రెండూ వుంటాయి. మరో నత్తతో జత కట్టేటప్పుడు మొగ జననేంద్రియం జతకట్టే దాని ఆడ జననేంద్రియంతో, ఆడ జననేంద్రియం ఎదుటిదాని మొగ జననేంద్రియంతోను జతకడతాయి. తర్వాత రెండు నత్తలూ పిల్లలు పెడతాయి. అంటే ప్రతీ నత్తలో తల్లీ తండ్రీ రెండూ వుంటాయన్నమాట.

# సంసార క్లేశం

విదురుడు ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు "ఈ లోకము నిస్సారమని గ్రహించిన పురుషుడు దేనిపట్ల ప్రత్యేకమయిన అభిమానాన్ని పెంచుకోడు. స్థిర చిత్తంతో శోకాన్ని దరి చేరనివ్వడు. ఈ శరీరాన్ని విడచి మరో శరీరాన్ని పొందడమంటే ఒక ఇంటి నుండి, మరో ఇంటికి వెళ్ళడం వంటిది ; ఒక వస్త్రాన్ని విడిచి మరో వస్త్రాన్ని కట్టటం లాంటిది.

"ఈ శరీరం కుమ్మరిచేసే కుండ వంటిది. కడవను చేయడానికి కలిపిన మట్టిని సారె మీద పెట్టేటప్పుడు అది విచ్చిపోవచ్చు ; సారెమీద దానికి రూపు దిద్దేటప్పుడు చెడిపోవచ్చు ; దానిని ఎత్తి నేలను పెట్టేటప్పుడు పగల వచ్చు ; ఎండినప్పుడు, కాల్చడానికి ఆవము మీదకు ఎక్కించినప్పుడు చిట్లిపోవచ్చు ; ఆ కడవను జనులు వాడగా పగిలిపోవచ్చు. ఈ శరీరమూ అట్టిదేనని గ్రహించు. ఏమంటే గర్భాదాన వేళయందు, పిండావస్థలోను, ప్రసూతి సమయాన, బాల్యమున, యౌవనాన, ప్రౌఢత్వాన్ని పొందాక, వార్ధక్యాన ఎప్పుడో అప్పుడు ఈ శరీరానికి కర్మానురూపమైన నాశనం తప్పదు. అందుచేత తమ తమ సుకృత దుష్కృతాల మార్గాన పోయిన నీ కొడుకులకోసం విచారించి ప్రయోజనం లేదు. ప్రాజ్ఞులు సంసారం దుఃఖబహుళమని ఎరిగి, దానిని గడచి, శాశ్వత సుఖాన్ని పొందుతారు."

ధృతరాష్ట్రుడు సంసార దుఃఖ బహుళత, తద్గహనత్వము ఎట్టివో వివరించమనగా, విదురుడు ఇలా చెప్పాడు.

"మనుజుడు ప్రసూతి కాలంలో శిశువయి రోదిస్తూ భూమిమీద పడతాడు. బాల్యంలో శుచి, అశుచి ఎరుగక జుగుప్సావహమైన ప్రవర్తన కలిగిఉంటాడు. యౌవనములో విషయ పరత్వావేశం దుఃఖకారి అవుతుంది ; వార్ధక్యంలో బలము, ఉత్సాహము ఉడిగి, ఇంద్రియాల పటుత్వం తగ్గుతుంది. రోగానికి లోనై యముని పాశానికి పట్టుబడుతాడు."

"ఇలా సంసారం దుఃఖబహుళమని విస్పష్టంగా కనబడుతూన్నా, లోభ, క్రోధ, మదముల చేత ఉన్మత్తులైన దుర్మదులు ఇందు రమిస్తూనే ఉంటారు. ఇందులోని సుఖ లేశం కోసం ఒకళ్ల నొకళ్ళు తెగ నరుకుకుంటూ, ధర్మమార్గాన్ని తప్పి యమకింకరుల చేత పడతారు. విమలమైన బుద్ధిగలవారు బుధుల వలన యదార్థాన్ని తెలిసికొని, నిత్యానంద స్వరూపులవుతారు. దీని గహనత్వం పెద్దలవల్ల వినబడింది. చెపుతాను విను.

## వడలి మందేశ్వరరావు

"అది అతి దుర్గమమైన అరణ్యప్రదేశం. అందులో ఒక భూసురుడు వెడుతున్నాడట. అడవిలో అనేకమైన భయంకరమైన మృగములు అతనిని అడుగడుగునా భయపెడుతున్నాయి. పరితాపం చెందిన ఆ విప్రుడు ధైర్యాన్ని కోలుపోయి దారి తప్పాడు. వెనుక చూడగా తెక్కలి కాలుం దోం తెంచి కాతనికి ! " భయంతో అతడు వణికిపోయాడు. పాదములు తొట్రుపడ్డాయి. తప్పుకొని నిలవడానికి చోటు కనబడడం లేదు ; దిక్కు తోచలేదు. ఎంతదూరం వెళ్ళినా ఈ భయంకరమైన అడవికి అంతూ దరీ కనబడలేదు ; పైగా ఆ భీషణారణ్యంలో ఎటు చూసినా దట్టంగా ఒడ్డిన ఉరులు ! ఇంతలో ఘోరాకార అయిన ఒక స్త్రీ అతనిని కౌగలించుకొన్నది. కొండల్లాంటి అయిదు తలల పాములు అనేకం ఆ వనంలో తిరుగుతున్నాయి. అక్కడ ఒక బావి లతలతో కప్పబడి నిగూఢంగా ఉంది. అత డా నూత బడ్డాడు; ఒక

బలమైన తీగకు చిక్కుకొని తలక్రిందుగా వ్రేలాడుతూ, కొమ్మనున్న పనసలా ఉన్నాడు. నూతిలో ఒక భయంకరమైన సర్పం నాలుకలు జాపుతూ ఉండగా, ఆరుతలలూ, పన్నెండు కాళ్ళూ "కృష్ణ శబలవర్ణంబును గల మహా గజం" బా నూతి దగ్గరనున్న తరువు దగ్గరకు హుటాహుటీగా వస్తోంది. ఆ చెట్టుమీద శాఖోపశాఖల మీద రంగు రంగుల తుమ్మెదలు మధువును కురుస్తూండగా, తెల్లని, నల్లని ఎలుకలు రెండు ఆ వృక్షము మూలాన్ని నరుకుతున్నాయి.

"ధరణి నాథ వినుము మధువుధార లెల్లప్రొద్దును
దొరఁగు చుండ నతఁడు వానిదోహలమున నాను చుం
డొనయఁ డెప్డుఁ దృప్తి వగల - ప్రోక నైన యట్టి దు
స్తరపు టున్కి కొల్లఁబాటుఁదన్కఁడించు కేనియున్
- స్త్రీ : 1 - 48

"ఒక వంక సర్పాలు, ఉరులు, జుగుప్సను కలిగించే కామిని, అయిదు తలల ఏనుగు - భయాన్ని కొల్పుతున్నాయి ; ఇక నూతిలో చూడగా దారుణమైన సర్పం, ఉన్న చెట్టును కూలదోయడానికా అని సమీపించే ఆరు తలల ఏనుగు, దాని వేళ్లను కొరికే ఎలుకలూ, అస్థిరమైన మధువు ధార - ఇన్నింటి వల్ల అతని మనసు వికలమై ఉన్నా, అతడు జీవితాశ మాత్రం విడచి పెట్టడు !"

"అయ్యో పాపం ! అతని దెంత దయనీయమైన స్థితి ! అతనికి విముక్తి ఎలా కలిగింది ?" అని ధృతరాష్ట్రుడు అడుగగా, విదురుడిలా చెప్పాడు.

"జగజ్జనులందరూ మోక్షార్థులవడానికి, వారికి బోధ కల్గడానికి మహాప్రాజ్ఞులైన విశారదులందరూ జీవితానికి అద్దం పట్టేటట్టుగా ఈ ఇతిహాసాన్ని చెప్పారు. దాని స్వరూపాన్ని వివరిస్తాను విను.

"ఆ దుర్గంబు సంసార గహనంబు ; అక్కడి క్రూర మృగాలు, ఉరులు రోగాలు ; ఆ కామిని జర; పంచ శిరస్కమయిన గజము లింద్రియ ప్రపంచము ; ఆ నూత మున్న సర్పం అంతకుడు ; తీగ జీవితాశ ; ఆ బావి దగ్గరనున్న చెట్టే ఆయువు ; దాని పైపు నడచే సామజం సంవత్సరము ; దాని ఆరు తలలు ఋతువులు ; దాని పన్నెండు పాదాలూ నెలలు ; చెట్టు వేళ్ళను కొరికే ఎలుకలు అహోరాత్రాలు ; మధుకరములు కామములు ; మధుధారలు కామ రసములు ; మధు సంచయనము ఆయువు ; వీని వలన మానవులు ఆసక్తులవుతారు. ఈ సంసార చక్ర పరివర్తనాన్ని బుధులు ఎరుగుదురు, వారు దీని పాశాలను త్రెంప శక్తి కలిగి ఉంటారు"

అంబికేయుడు ఈ మాటలను విని, విదురునితో, "నీవు మిక్కిలి నిర్మల చిత్త ప్రవృత్తి వవడం వల్ల హితవును ఉపదేశించావు. ఇంకా ధృతిని కల్గించే మాటలను చెప్పవయ్యా !" అన్నాడు.

విదురుడిలా అన్నాడు : "ఈ విషయ ప్రపంచమనే బురదలో మునుగుతూ, తేలుతూ, ఉంటాడు మానవుడు. రుజ, జర క్రమంగా ఆక్రమిస్తూండగా, క్రొవ్వు అరిగి, అందం తరిగి మనిషి అపాత్రపు చావుకు లోనవుతాడు.

"ఈ శరీరమన్నది రథము ; దానికి సారథి సత్యము; ఇంద్రియములు గుర్రాలు ; బుద్ధి వ్యాపారములు పగ్గములు. ఈ గుర్రాలు మహా వేగంతో పరుగెడుతూ ఉంటే, పురుషుడు వాని ననుసరించే పరిభ్రమిస్తూ దుఃఖానికి లోనవుతాడు. బుద్ధిమంతుడు ఈ సంసార దుఃఖాలకు అతీతుడై ఉంటాడు. ఆ పగ్గాలను శీలమనే పెరవుతో స్వాధీనపరచుకొని, రథ వేగాన్ని ఉడుప గలిగినవారు జనన మరణాదుల వలన భయాన్ని పొందకుండా పరమ సుఖాన్ని పొందుతారు. దీని నెరిగి శాంతిని పొందు. పుత్రాది జ్ఞాతులకు 'ఔర్ధ్వ దైహికంబులు' చేయించి, సుఖాన్ని పొందు."

పుత్రుల పరలోక క్రియా విషయమైన విదురుని ఈ చివరిమాట ధృతరాష్ట్రునికి పిడుగుపాటు కాగా, అంతవరకూ విన్న మాటలన్నింటినీ పోవిడిచి శోకం అతిశయిల్లగా, ఆ వృద్ధరాజు మూర్ఛిల్లాడు. ఇక ఈయన్ను తేర్చడానికి సమర్థులేరీ !

అట్టి సమయాన కృష్ణద్వైపాయన మునీంద్రుడు సన్నిహితుడయాడు !

# గీత - అమృత వర్షిణి

గంగా మహదేవ్

ధృతరాష్ట్ర ఉవాచ :—

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతాయుయుత్సవః
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ।

వ్యాఖ్య :— భగవద్గీతయందు ప్రథమ దర్శనము ధృతరాష్ట్రులవారిదే. ఇతడు జాత్యంధుడు. వేదాంతము నందలి పాత్రలన్నియును నిజమునకు మన స్థితికి ప్రతిబింబములు. నిజమునకీ లోకమందున జాత్యంధు డెవరు? "వివేకాన్ధోహి జాత్యన్ధః" నిత్యానిత్య వివేకము లేక సత్యసత్త్వమును కనుగొనలేని విమూఢాత్ముడే జాత్యంధుడు. ఇట్టివారి ప్రతిచిత్రమే ఈ ధృతరాష్ట్రుల వారు.

తనది కాని రాష్ట్రమును తాను ధరించినవాడు ధృతరాష్ట్రుడు. తాను కాని, తనది కాని దేహమును తాను ధరించి తానే దేహమనుకొనువాడు ధృతరాష్ట్రుడు. అనాత్మను ఆశించి, ఆశ్రయించినవాడే ధృతరాష్ట్రుడు. ఇది జీవస్థితికి సంకేతము.

జీవులయొక్క మానసికస్థితి ఇచ్చట సుందరముగా మలచబడింది. ధృతరాష్ట్రులవారు సంజయులవారిని "ఓ సంజయా! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమందు యుద్ధము చేయ తలంపు గలవారలై కూడినట్టి నావారును మరియు పాండవులును ఏమి చేసినారు ?" అని ప్రశ్నించినాడు.

"నావారు, పాండవులు"అనడం ద్వారా ధృతరాష్ట్రుని లోని పుత్రవ్యామోహము, మమకారము స్పష్టముగా గోచరమౌతున్నది. జీవులలో ఇట్టి వ్యామోహ మమకారములుండునని తెలియజెప్పుటే ఇందున్న అంతరార్థము.

పాండవులు, కౌరవులు యుద్ధసన్నద్ధులై కూడిన క్షేత్రము కురుక్షేత్రము. అది ధర్మక్షేత్రము. ధర్మమును (కురు) చేయించునదే ధర్మక్షేత్రము. ధర్మకర్మల కాలవాలమైనదే ధర్మక్షేత్రము.

దేహము కర్మయుతమైనటువంటిది. మానవశరీరము ధర్మాచరణయోగ్యమైనది కాన ఈదేహమే ధర్మక్షేత్రము. కురుక్షేత్రము లేక కర్మక్షేత్రము. ఇట్టి దేహమునందు దైవీగుణములు (పాండవులు), అసురగుణములు యుద్ధము చేయకూడినవై ఏమి చేసినవి" అని జీవుడు సంజయుని, సమ్యక్ జయము గలవానిని అనగా విశేషముగా (ఇంద్రియములను) జయించినవానిని అనగా గురువును ప్రశ్నించుచున్నాడు.

దీనివలన ఇంద్రియ నిగ్రహ సంపన్నుడే సందేహ నివృత్తి జేయ సాధికారి యని అట్టివానినే సాధకు లాశ్రయించాలని గీతామాత ప్రబోధించుచున్నది. నేడు చెప్పునది వేదాంతము, చేయునది రాద్ధాంతము. ఇట్టివారు విత్తగురువులేగాని, చిత్తగురువులు కారు; బాధగురువులే, కాని బోధ గురువులు కాదు.

ఇట్టివారిని కాక జితేంద్రియులను ఆశ్రయించి, వారు చెప్పినదాని నాలకించి, ఆనందించమని సలహా నందించుచున్నది గీత. గీత అగాధమైన తత్త్వములతో విరాజిల్లుచున్న వేదాంత మధురసుధాస్రవంతి. ఇందలి మాధుర్యమును ప్రతివారును ఇతోధికముగా గ్రోలి తరింతురు గాక !

"వర్ధతాం బ్రహ్మవిద్యాచ లోకేఖ స్సుఖయేధతామ్"

-*-*-

‘అమ్మ పాదపద్మములకు మకరంద్ కృతానేక నమస్కారములు. ఉభయకుశలోపరి.

ఈ ఉత్తరం నేను నీకు అత్యవసర పరిస్థితిలో వ్రాస్తున్నాను. ఆ పరిస్థితి ఏమిటో కూడా వివరిస్తున్నాను. సావధానంగా పరిశీలించవలసినది.

ఇక్కడ డాక్టర్ రాజు ఇంటి పరిస్థితులు పూర్తిగా అధ్వాన్నమైపోయాయి. కేవలం పగబట్టిన త్రాచులా నా మీద దూకడమే తప్ప వుచితానుచితాలు విస్మరించాడు. చాలా అఘాయిత్యాలు చేశాడు. చేయించాడు. అన్నిటినీ భరించాను. ప్రతీకార చర్యను కోరలేదు. అయినా సరే విధి నిర్ణయాన్ని ఆయన తప్పించుకోలేకపోయాడు.

డాక్టర్ ముదిగొండ శివప్రసాద




# హ్యూమానిటీ ఫర్ సేల్

ఇటీవల ఆడపిల్లలను బొంబాయి ద్వారా ఇతర దేశాలకు అమ్మే ఒక వ్యవహారంలో ఆయన చిక్కుకున్నాడు. వైద్య వృత్తిని సాధనంగా చేసుకొని సమాజంలో అపమార్గానపోయి తెలిసో తెలియకో కాలు జారిన చాలామంది అభాగ్య స్త్రీలను బెదిరించో, వంచించో, ధనాశచూపో బ్లాక్ మెయిల్ చేసో ఈయన తన అసిస్టెంట్ శ్యామ అయ్యంగార్ ద్వారా ఒక కంపెనీకి అమ్మేస్తున్నాడు. ఆ విషయం పోలీసుల దృష్టికి వచ్చింది. వాళ్ళు శ్యామ అయ్యంగారిని, రాజునూ అబిడ్స్‌లో ఇబ్రహీం కంపెనీలో కొంతమందినీ అరెస్టు చేశారు. ఆ విషయం పత్రికల్లో వచ్చింది. మీకు తెలిసే వుండవచ్చు. రాజు ప్రత్యక్షంగా ఈ నేరంలో పాల్గొన్నట్లు పోలీసులు ఆధారాలు సేకరిస్తున్నారు. ప్రస్తుతం బెయిల్ మీద విడుదల చేయబడ్డాడు. శ్యాముకు మాత్రం త్వరలోనే తీవ్రమైన కఠిన శిక్ష పడుతుంది. యావజ్జీవ శిక్ష పడ్డా పడవచ్చు. కేసు నడుస్తున్నది. రాజుకు ఆరోగ్యం చెడిపోయింది. రక్తపుపోటు పెరిగి పక్షవాతానికి దారి తీసింది. పోలీసులు ఇటీవల మన ఆశ్రమానికి కూడా మారువేషాలతో వచ్చి అక్కడ ఏమీ అన్యాయాలు జరగడంలేదని నిర్ధారించుకొని వెళ్ళిపోయినట్లు తెలిసింది. రాజు కుమార్తె రాణి మన ఆశ్రమంలోనే వున్నట్లు వారు వెల్లడించారు. కళావతి తన కుమార్తెను చూడాలని కుతూహల పడుతున్నది. కాని అనుకోని ఈ అవాంతర పరిస్థితులవల్ల ఇంటిల్లిపాదీ మనస్సులు పాడైనాయి. రాజు ఎంతోకాలం శ్రమించి నిర్మించుకొన్న ప్రతిష్ట సముద్రం ఒడ్డున కట్టిన పిచ్చుక గూళ్ళలాగా ఈ కెరటాల తాకిడికి అదృశ్యమైపోయింది. ఇప్పుడాయన ఇల్లు కదిలి

బయటకు రావడంలేదు. దవాఖానా ఎప్పుడో బంద్ అయిపోయింది. అమ్మా! ఎంత విచిత్రం! నా క్లినిక్‌ను అపివేయాలని విశ్వ ప్రయత్నం చేశారు. కాని నేను దాన్ని స్వచ్ఛందంగానే మూసివేశాను. నాదానితోబాటు రాజు దవాఖానా కూడా శాశ్వతంగా మూతపడిపోయింది. ఇక మళ్ళీ ఆయన వైద్యం చేస్తాడని అనుకోను.

నేను వైద్యం మానివేసినట్లే లెక్క. అంతేకాదు నా అన్వేషణలో ప్రస్తుత వైద్య విధానానికి అందులోని లోపాలకు పరిష్కార మార్గం కనుక్కుంటున్నాను. ఆ విషయం నేను స్వయంగా వచ్చినప్పుడు నీకు నివేదిస్తాను. కాగా మొన్న ఇక్కడ తీవ్రమైన ముసురు వచ్చింది. అప్పుడొక సంఘటన జరిగింది. దానిని నీకు వివరంగా వ్రాయాలనుకుంటున్నాను.

నగరమంతా బాగా ముసురు పట్టింది.

నేను నా బాకీలన్నీ లెక్కచూచి కాగితంమీద వ్రాసుకుంటున్నాను. బయట మూసీ నది పైనెక్కడో కురిసిన వర్షవేగంవల్ల తీవ్రంగా ప్రవహిస్తున్నది. ఎక్కువైన నీళ్ళను కార్పొరేషన్ అధికారులు ఉస్మాన్ సాగర్‌నుండి కూడా మూసీకి విడుదల చేశారు. కరంటు తరచు ఫెయిలవుతున్నది. కొవ్వొత్తులు వెలిగించి పెట్టుకున్నాను నగరమంతా క్షణం చీకటి, క్షణం వెలుతురు.

బయట చంద్రయ్య ఇంటిదీపం మినుకు మినుకు మంటున్నది. చంద్రయ్య అంటే ఎవరో నీకు తెలియదు. చెప్పాలి కదూ చెపుతాను. ఈయన బరకత్‌పురాలో మూసీ ఒడ్డున బుట్టలల్లుకొని బ్రతికే ఒక సామాన్యుడు. ఇటీవల రాజు దౌర్జన్యాలకు గురియైన అమాయక కుటుంబాలలో ఈయనదీ ఒకటి. చంద్రయ్య మరదలు సారక్క అనే ఆమెను పోలీసులు బొంబాయి మార్కెట్టులో పట్టుకున్నారు. ఇబ్రహీం కంపెనీ చేత అమ్మబడ్డ పిల్లల్లో ఆమె కూడా ఒకతెట! పూర్తి వివరాలు తెలిసి కేసు నడిచేవరకూ వీళ్ళను నిర్బంధంలో వుంచారు. ఇలా అమ్మబడ్డ స్త్రీలకు కొందరికి, బొంబాయిలోని వైద్యులు కొందరు, ఈ కంపెనీకి శాశ్వత సలహాదార్లుగా వుండి గర్భస్రావం నిర్వహిస్తారు. అలా వీలుబడనప్పుడు ఆమె ప్రసవించేవరకూ సురక్షితంగా పోషించి అనంతరం ఆ పసికందులను ఏ డ్రైనేజీలోనో తొక్కివేసి స్త్రీ ను మాత్రం అమ్మివేస్తున్నారు. ఈ సారక్క పరిస్థితి ఏమైందో మరి తెలియలేదు. నిర్బంధంలో పోలీసులు ఆమెను ప్రశ్నించడం మొదలుపెట్టారు. తీవ్రంగా భయపెట్టారు కూడాను. ఫలితంగా ఆమె ఆత్మహత్య చేసుకున్నది—ఔను మరి! ఆమె మళ్ళీ ఈ సభ్య సమాజంలోకి ఎలా రాగలుగుతుంది? ఎలా జీవిస్తుంది? ఎక్కడ? అందుకే తనకా బానిస జీవితమే ఈ సమాజ జీవనంకన్నా మెరుగనిపించి వుంటుంది. అది కలలా కరగిపోయినప్పుడు బ్రతుకు మళ్ళీ దుర్భరమై బజారున పడ్డప్పుడు ఆత్మహత్యను వరించిందా అభాగ్యురాలు.

(జరిగిన కథ)

**శ్యాం రాణీ బ్రతికివున్న విషయం, ఆమె డా॥ మకరంద్ వాళ్ళమ్మ దగ్గరున్న విషయం డా॥ రాజుతో చెప్పి అతనికి బేడీలు వేయించాలని తహతహలాడతాడు. పోలీసులకి ఫోన్ చేసి వాళ్ళని పిలిపించారు. పోలీసుల ద్వారా రాణీ గర్భవతన్న విషయం విని నిర్ఘాంత పోతారు. అమ్మాయిలని అమ్మిన నేరానికి శ్యాంని అతన్తోపాటు రాజునికూడా జీపెక్కించుకొని పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్తారు వాళ్ళు.**

(ఇక చదవండి)

ఈ విషయం చంద్రయ్య దంపతులకు తెలిసింది. నాకు తెలుసు ఈ ముసురులో వాళ్ళు ఏడుస్తూ వుండి వుంటారని— వాళ్ళ కన్నీళ్ళే మెలికలు తిరిగి జరజర తారురోడ్డుపైనుండి పాకుతూ రాజు భవనానికి అభిముఖంగా ప్రయాణించి వుండవచ్చు. చీకట్లో కళ్ళు కన్పడని దశలో ద్వేషం పడగవిప్పి రాజు భవనాన్ని పాకి వుండవచ్చు— ఏ మూలలో పొంచి వుండవచ్చు.

రాత్రి నేను లెక్కలు ముగించి ఫలహారం చేసి పడుకున్నాను, నిద్ర పట్టలేదు. కళ్ళముందు సంఘటనలు చలనచిత్రంలోని రీళ్ళలాగా పరుగెత్తుతున్నాయి. నేనెందుకిక్కడికి వచ్చినట్లు ? ఏమిటి సాధించాను ? ఏమిటిక చేయవలసి వుంది? — ఈ అన్వేషణలో నా మనస్సు బాగా అలసిపోయింది, ఎప్పుడు నిద్ర పట్టిందో నాకే తెలియదు.

రోడ్డుపైన జనసంచారం బొత్తిగా లేనట్లే చెప్పవచ్చు రాత్రి పొద్దుపోతున్నకొద్దీ వర్షం పెరుగుతూ వుంది. వీధి దీపాలు చాలా చెడిపోయాయి. వెలగడం లేదు.

కళావతి తన కొడుకు సంతోష్‌కు పాలు పడదామని ఉయ్యాల దగ్గరికి వెళ్ళింది. వెళ్తూవుంటే మెట్లవద్ద ఏదో కదిలినట్లనిపించింది. లైటు వేసి చూచింది. చీకట్లో గోడ కంటిపెట్టుకొని ఒక పాము మెల్లగా పాకుతున్నది. భయంతో కెవ్వున కేక వేసింది.

ఆ శబ్దానికి పాము తడిపొలుసులు గోడ అంచుల నుండి జారాయి. నేలపైకి జరజరా పాకుతూ వచ్చింది. కళావతి చేతిలో పాలసీసాతో ఇంకా గుమ్మం దగ్గరే నిలబడిపోయింది. పాము గది మధ్యకు వస్తూండటంతో ఆమె భయంతో కిందికి పరుగెత్తింది. 'పాము-పాము'ని పెద్దగా కేక వేసింది. డాక్టరు రాజు అస్వస్థతతో అలా మగతగా పడుకున్నాడు మంచంమీద, ఈ కేకలతో లేచాడు.

"ఏమిటి ? ఎక్కడ...."

"పాము- పైన హాలులో పాము...."

లైట్లు వేశారు-లైట్లు చాలా డిమ్‌గా వెలుగుతున్నాయి ఏ క్షణాన్నయినా ఆరిపోవచ్చునన్నట్లు మిణుకుమిణుకు మంటున్నాయి గాలిలోని కొవ్వొత్తుల్లా, కళావతి మాతృ హృదయంలో.

నిద్రపోతున్న పనిమనిషి లేచింది.

"పాము-- పాము" అన్న కేకలు విన్నది. "ఎక్కడ ఏమిటి" అన్న విచారణ లేకుండా తానూ అరవడం మొదలుపెట్టింది- అరిచి సాధించేదేమిటి ?

ఇది మహానగరం.

ఒకరి జీవితాలు ఒకరికి పట్టవు.

పక్కవాటాలో వ్యక్తి చస్తే ఆ శవాన్ని ఈడ్చారా లేదా అన్న విషయంతో నిమిత్తం లేకుండానే ఇవతలి వాటాలో విందు భోజనాలు జరుపుకొంటూ వుంటారు. అలాంటిది రాత్రిపూట చీకట్లో ముసురులో "పాము పామంటే" వినేదెవ్వరు? విన్పించేదెలా? అసలే ఆ రాజు తన లంకంత కొంపనూ ఎంతో కట్టుదిట్టంగా నిర్మించాడయిపోయె- అరిచి "గీ" పెట్టుకున్నా లోపలి శబ్దాలు బయటకు విన్పడనట్లు-విన్పడితే తాను బేరానికి తెచ్చిన అనాథల ఆక్రందనలు ఎన్ని బజారుల్లో ప్రతిధ్వనించేవో, ప్రళయాన్ని సృష్టించేవో.

పనిమనిషి మెట్లు దిగి వీధిలోకి వచ్చింది.

ఇరానా హోటల్ ఎప్పుడో కట్టేశారు.

వీధి నిర్జనంగా వుంది.

రాజు తన కావలా జవానును కూడా మాన్పించేశాడు మొన్నటి కేసుల అనంతరం.

ఆమె పరుగెత్తుకొంటూ చంద్రయ్య గుడిసెవైపు పరుగెత్తింది.

"చంద్రయ్యన్నా- రా-రా పాము-పాము"

"ఎక్కడ- ఏమిటి?" చివాలున లేచి కూర్చున్నాడు చంద్రయ్య.

"మా రాజుగారి మేడలో పాము - జల్దీరా- నీ కాళ్ళకు మొక్కుతా."

ఉన్నపాళాన అలాగే చంద్రయ్య బయలుదేరాడు చేత్తో ఓ చిన్న వెదురుముక్క పుచ్చుకొని చకచకా మేడపైకి వచ్చాడు.

రాజు మూరెడు పొడుగు బ్యాటరీని పాము ముఖానికి వేసి పట్టాడు. అందువల్ల అది అటూ ఇటూ అంత వేగంగా కదలలేకపోతున్నది.

లైటు వెలుతురులో స్పష్టంగా కృష్ణ పాదాలు కనిపిస్తున్నాయి- త్రాచుపామే !

కళావతి పెద్దగా ఏడుస్తున్నది.

రాజు ఏడ్వవద్దని- శబ్దమే చేయవద్దనీ హెచ్చరిస్తున్నాడు - తానూ లోలోపల ఏడుస్తున్నాడు భయంతో- హాలు మధ్య ఉయ్యాల- ఉయ్యాలకు సమీపంలో పాము. హాలుకివతల గుమ్మందగ్గర రాజూ కళావతీ- చంద్రయ్య గుమ్మం దగ్గరికి వచ్చి లోపలికి తొంగి చూచాడు, పాము అలాగే వుంది. (సశేషం)

# దైవము - దేవాలయము

భోగాది కృష్ణారావు

మానవుని జీవితం రెండు విధాలు. ఒకటి భౌతికం. రెండు ఆధ్యాత్మికం. ఇల్లు, ఇల్లాలు, పిల్లలు, వారి శ్రేయస్సు, సంపాదన, పదవులకై ప్రాకులాట మొదలైన లౌకిక విషయాలకు సంబంధించినది భౌతిక జీవన విధానం. దైవభక్తి, దైవచింతన, దైవారాధన, పరలోక చింతన, దైవగ్రంథ పఠనం మొదలైన విషయాలు ఆధ్యాత్మిక జీవన విధానంలో భాగాలు. మానవుడు భౌతికంగా ఎంతటి ఉన్నత జీవితాన్ని గడుపుతున్నా ఆధ్యాత్మిక జీవితాన్ని కూడ అలవర్చుకోవాలి. ఆధ్యాత్మిక చింతన లేని భౌతిక జీవితం తావి లేని పూవు వంటిది. అందువలననే మానవుడు అతి ప్రాచీన కాలం నుండి దైవాన్ని ప్రార్థించడం, దేవాలయాలను నెలకొల్పడం అలవాటు చేసుకొన్నాడు. ప్రపంచంలో అన్ని ప్రాంతాలలోను అన్ని జాతుల వారికీ ఈ దైవారాధన ఏదో ఒక రూపంలో ఉన్నదని మన చరిత్ర గ్రంథాలను బట్టి తెలుస్తోంది. దైవాన్ని ఆరాధించే ఈ ఆచారం నాటికీ నేటికీ మానవ జీవితంలో అనివార్యమైన అంశంగా నిలిచిపోయింది.

దైవం మన కంటికి కనిపించకపోయినా సర్వసృష్టికి మూలభూతమైన, దివ్యమైన ఒక శక్తి ఉన్నదని మనం విశ్వసించ వలసి యున్నది. భగవంతుడు కరుణామయుడు, సర్వవ్యాపి, సర్వసమర్థుడు అని భావింప వలసి యున్నది. భగవంతుని సృష్టిలోని ప్రతి ప్రాణిని మనం దయా దృష్టితో చూచి, ప్రతి ప్రాణిలోను దైవాంశాన్ని దర్శించ గలిగినప్పుడు భగవంతుని ప్రత్యక్షంగా చూచినట్లే. తోటి మానవుని పట్ల సహృదయత ప్రదర్శించ గలిగితే మహోన్నతుడైన ఆ భగవంతుని సేవించినట్లే.

మానవుడు నిత్యమూ లౌకిక విషయాలలో మునిగి జీవితాన్ని గడుపుతూ వుంటాడు. అటువంటి మానవునికి ప్రశాంత చిత్తాన్ని కలిగించి, లౌకిక విషయాల నుండి కాస్తంత విశ్రాంతి కలిగించడానికి దేవాలయాలు తోడ్పడతాయి. దైవం పేరుతో దేవాలయాలు దర్శించినప్పుడు దైవచింతన మన మనస్సులో ప్రవేశించి, పాపభీతి కలిగి మనం సన్మార్గగాములు కావడానికి అవకాశం కలుగుతుంది.

## ఆణిముత్యాలు

" ఏ విషయమై నీకు జ్ఞానం కావాలో, దానిమీద నీ బుద్ధిని నిలపాలి. ఇటూ, అటూ కదలనియ్యకూడదు. దీనినే ఏకాగ్రత అంటారు. ఏకాగ్రత నీకలవడకపోతే, నీకెట్టి జ్ఞానమూ కలగదు. ఏ విద్యా అబ్బదు. నీవేపని కుశలంగా చేయలేవు. కాబట్టి ముందు ఏకాగ్రత కుదుర్చుకో. లేకపోతే వట్టి నిరర్థకుడవవుతావు.

— శ్రీ ముట్నూరి కృష్ణారావు

" వాదములూ, తర్కములూ ఎప్పుడూ నిష్ఫలములే. వాదాలతో భేదాలు పోగొట్ట ప్రయత్నించడం వల్ల అసంతృప్తి, విరోధమూ పెరుగుతాయి. మొదట హృదయాన్ని జయించు. తరువాత హేతువుతో మనస్సును ఒప్పించు. వాదం విఫలమైనచోట ప్రేమ విజయం పొందగలదు. "

— శ్రీ స్వామి రామతీర్థ

" ప్రేమ కళ్ళతో చూడదు, మనస్సుతో చూస్తుంది. అందుకే ప్రేమ దేవత గ్రుడ్డిదని వర్ణించారు. "

— షేక్స్పియర్

" జంతువులాగె ప్రవర్తించే మనిషి జంతువుకన్నా హీనమైనవాడు. మృగ లక్షణం జంతువుల సహజ గుణం, మనిషికి కాదు. "

— శ్రీ మహాత్మాగాంధీ

# అడవి బాపిరాజు నవల - అడవి శాంతిశ్రీ

ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో అడవి బాపిరాజు ఒక అద్భుత వ్యక్తి. ఆయన కళోపాసన సర్వతో ముఖంగా ప్రస్తరించింది. బాపిరాజు కవి, కథకుడు, నవలా రచయిత, చిత్రకారుడు, పత్రికా సంపాదకుడు, సినిమాకు కళాస్రష్ట. ఇన్ని ప్రజ్ఞలున్న బాపిరాజు మహా భావుకుడు. ఆయన గేయ పంక్తుల్లోనూ, చిత్ర రేఖల్లోనూ ఒక గొప్పలాలిత్యమూ, భావసౌకుమార్యమూ గోచరిస్తూ ఉంటుంది. ఆయన కథా కథన రీతి కళాత్మకమైనది. వచన నిర్మాణశైలి ఏదో దివ్య పరిమళం అద్దుకున్నట్లు విలక్షణంగా ఉంటుంది. ఆయన సాహిత్యమంతటా తొంగి చూచే సౌకుమార్యం, సౌందర్యతృష్ణ-బాపిరాజు వ్యక్తిత్వానికి దర్పణం పట్టినట్లుగా అనిపిస్తాయి. అందుకే నేమో-అందరిచేతా ఆప్యాయంగా 'బాపిబావ' అని పిలిపించుకో గలిగినాడు బాపిరాజు.

### సి. వేదవతి

కవిగా బాపిరాజు ప్రణయోపాసకుడు. సృష్టిలోని పరమ సౌందర్యాలన్నీ కలిపి మూర్తి కట్టుకొన్న వీరి ఊహాసుందరి 'శశికళ'- విశ్వనాథవారి కిన్నెరసాని వలె, నండూరి వారి యెంకి వలె, కృష్ణశాస్త్రి ఊర్వశివలె- బాపిరాజు శశికళ కూడా కావ్య గౌరవం అందుకుని రస జ్ఞుల మనోవీథుల్లో నిలిచిపోయింది.

చిత్రకళా రంగంలో బాపిరాజు తన కళాభిజ్ఞతను చాటుకొని చిరస్థాయిగా నిలిచిపోయినాడు. ఈయన కావ్య రచనం చిత్రకళారూపకంగానూ, చిత్రకళా సాహిత్య సురభిళంగానూ ఉంటుందని ప్రశస్తి పొందిన కళాహృద యుడు.

గేయాలు, కథలూ అటుంచి, నవలల విషయానికొస్తే సాంఘిక, చారిత్రక నవలలు- తనదైన విశిష్ట శైలిలో ఎన్నో రచించి-ఇనుమడించిన కీర్తి ప్రతిష్ఠలను పొంద గలిగినాడు బాపిరాజు. నారాయణరావు వంటి సాంఘిక నవలలు, హిమబిందు, గోన గన్నారెడ్డి వంటి చారిత్రా త్మక నవలలు - తెలుగు నవలా ప్రపంచంలో ఎన్నదగినవిగా నిలిచిపోయినవి.

దేశ చరిత్ర, ప్రకృతి పరిశీలన, మత సంబంధమైన విజ్ఞానము, సంగీత, శిల్ప, చిత్ర రచనాది లలిత కళలలో విశేషమైన పరిజ్ఞానము-ఉండటం వలన-ఆయావర్ణనలు బాపిరాజు తన నవలలలో కొంత పరిమితిని మించి చొప్పించటం మనకు కనిపిస్తుంది. కథ నడుస్తూ ఉన్న ప్పుడు, సంభాషణం జరుగుతూ ఉన్నప్పుడు-రచయిత హఠాత్తుగా ఆగిపోయి-ఒక సుందర చిత్రాన్ని, శిల్పాన్నో చూపించి "కొంతసేపు ఈ సౌందర్యాన్ని చూస్తూ ఆనందించండి!" అని వర్ణన ప్రారంభిస్తాడు. ఇది ఒక కాలంనాటి రచనా శిల్పం అని సర్దుకుపోయి చదవడం ప్రారంభిస్తే, పాఠకుడికి బాపిరాజు నవలలు చదవటంలో ఒక అపూర్వానుభూతి కలుగుతుంది. నవల లోని పాత్రలు, వారి స్వభావాలు, సంభాషణలు, అన్నీ ఒక ఉదాత్తమైన స్థాయిలో నడిచి ఒక అలౌకిక భావ స్ఫూర్తిని సంతరించుకుంటాయి.

అడవి బాపిరాజుగారి సాహిత్య వ్యక్తిత్వ ప్రాభవా లకు ఒక రేఖామాత్రమైన సమాలోచనం-ఈ అడవి శాంతిశ్రీ నవల పరిశీలనం-

ఆంధ్రదేశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలిన శాత వాహన రాజ్యం అంతానికి వస్తున్న కాలంనాటి చరిత్రాంశం ఈ నవలకు కథావస్తువు. చరిత్ర కథ కనుక- కథాక్రమం, అందులోని ముఖ్య పాత్రలు, కథాకాలం నాటి పరిస్థితుల గురించి క్లుప్తంగానైనా మనం తెలుసు కోవలసి ఉంటుంది.

చరిత్ర పూర్వయుగం నుండి ప్రారంభించి ఆంధ్ర దేశ సామ్రాజ్యం మహోజ్జ్వలంగా విలసిల్లినంత వరకూ–ఆంధ్ర వసుంధరకు–గోదావరీ, కృష్ణవేణీ పునీత నదీమ తల్లులకు వందన శతాలు అర్పిస్తూ బాపిరాజు నవలకు ఉపక్రమణం చేస్తాడు. కథాకాలంనాటికి శాత వాహన చక్రవర్తి యజ్ఞశ్రీ శాతకర్ణి మహాంధ్ర దేశాన్ని పరిపాలిస్తూ ఉన్నాడు.

ఆయన అప్పటికే శత వృద్ధు అయి, అవసానదశలో ఉన్నాడు. విజయపురం రాజధానిగా ఇక్ష్వాకు మహారాజు శాంతిమూలుడు రాజ్యం చేస్తూ ఉన్నాడు. అతడు శాత వాహన ప్రభువులకు అల్లుడు–సామంతుడు–హితుడున్నూ.

ఇక్ష్వాకుల యువరాణి, శాంతిమూలుని పుత్రిక శాంతిశ్రీ. ఆమె ఈ కథలోని ముఖ్యపాత్ర. శాంతి మూలునికి మహాసేనాపతి, మహామంత్రి–మహాదండ నాయకుడు అన్నీ–అయినవాడు అడవి బ్రహ్మదత్త ప్రభువు. అతడు చిన్నవాడైనా మహాజ్ఞాని, రాజనీతి విశారదుడు. ఆంధ్ర ప్రాకృత దేవభాషలలో నిష్ణాతుడు. కొన్ని రాజ్య కల్లోలాలూ, మనోవైక్లబ్యాలూ, యుద్ధాలూ, రాగ విరాగాలుతో కథ నడచి–కథానాయకి శాంతిశ్రీ అడవి బ్రహ్మదత్త ప్రభువును వివాహమాడి అడవి శాంతిశ్రీ కావటంతో సుఖాంతంగా ముగుస్తుంది.

మహారాజ కుమారి శాంతిశ్రీ అద్భుత సౌందర్యవతి. అలౌకికమైనది ఆమె సౌందర్యం. కాని ఆమె ప్రకృతి చాలా చిత్రమైనది. చిన్న పిల్లగా ఉన్నప్పటి నుంచీ ఆ అమ్మాయి రాగ ద్వేషాలకు అతీతురాలైన విరాగిని వలె ఉండేది. బుద్ధదేవుని పైన ఆమెకు భక్తి, ఆట పాటలు పట్టేవి కావు; బోధిసత్త్వుని జాతక కథలు, ధర్మ సూత్రాలు, త్రిపిటకాలు–చదువుతూ ఉండేది. సంగీత చిత్రలేఖనాది కళలు కూడా స్వీయానందానికి కాక తథాగతుని అర్చించటానికే అంటుంది. వయసు వచ్చినా; ఆమె శరీరసౌందర్యం పెరుగుతుందేతప్ప మనస్సుకు ఏవిధమైన స్పందనా కలుగదు. ఆమెను ఆ జడత్వంనుంచి మళ్ళించాలని, ఆమె శుద్ధసాత్త్విక ప్రకృతిని, రసమయ జీవన

## సమతా విహంగం

చూడ్డానికి 'రెండు' కళ్ళున్నా –
'చూపు'లో 'సమభావం' లేని మనిషికంటే –
'ఏకాక్షి' అయిన 'కాకే' నయం !
ఎంతో విశాలం దాని హృదయం !
తన–పర భేదం లేకుండా
అన్నింటినీ పిలిచి భోంచేస్తుంది –
'తన జాతి' కాకపోయినా
'కోయిలల్ని' పెంచి పెద్దజేస్తుంది –
"తమసోమా జ్యోతిర్గమయ" అన్నట్లు
'కావు–కావు' మని దైవాన్ని అర్థిస్తూ –
'నిద్రాముద్రిత' ప్రజానీకాన్ని
'చైతన్య'వంతుల్ని చేస్తుంది !
'ఆకారం' ఎలావుంటే ఏం
మనసులో 'మమకారం' వుండాలికాని –
'శ్రీకారం' ఎంతుంటే ఏం ?
హృదయంలో 'సహకారభావం'
వుండాలికాని –

వర్తమానంలో... ఎందరో సీతల
హృదయాలను పొడుస్తున్న
ఈ 'మానవాసురల'కన్న –
గతంలో... ఎప్పుడో సీత
ఉరఃస్థలిని పొడిచిన కాకాసురమే మిన్న !.

– రనపర్తి రామచంద్రాచార్యులు

ప్రకృతిగా మలచాలని సంకల్పించి–శాంతిమూల మహారాజు బ్రహ్మదత్త ప్రభువును ఆమెకు గురువుగా నియమిస్తాడు.

శాంతిశ్రీ బౌద్ధ ధర్మాభి రత, బ్రహ్మదత్తుడు ఆర్ష ధర్మాచరణ వ్రతుడు. ఆమెది భిక్కుని కావాలని తలుస్తుండే వైరాగ్య ప్రకృతి – ఆర్షవిద్యపైన ఆమెకు

అసక్తి లేదు. తండ్రి ఆజ్ఞను శిరసావహించి శిష్యరికం నెరపుతుంది.

సకల ధర్మశాస్త్ర వేత్త అయిన బ్రహ్మదత్తుడు మహా రాజకుమారి శాంతిశ్రీని చూడగానే ఒక చిత్రమైన అనుభూతికి లోనవుతాడు. తామిద్దరూ ఒకరి కొరకు మరొకరు జన్మించామని అనుకొంటాడు. అయితే, స్థాణు సదృశంగా ఉన్న ఆమె హృదయంలో ఆర్ద్రత కలిగేది ఎట్లా? మతధర్మంలోనూ, విశ్వాసంలోనూ, మనః స్థితిలోనూ ఇంత విరుద్ధంగా ఉన్న తామిద్దరకూ అనుసంధానం కలిగేది ఎట్లా?

బ్రహ్మదత్తుడు ఇట్లా విచికత్సకు లోనైనా నిర్వికార ప్రకృతితో ఆమెకు అర్ష ధర్మప్రబోధం చేయటానికి పూనుకుంటాడు. జన్మయోగి వలె సంచరించే శాంతిశ్రీ వైరాగ్య ప్రకృతికి కారణం ఆమె అవలంబించిన బౌద్ధ ధర్మమా? మరింకేమిటీ కారణం - అని వితర్కించుకొంటాడు. ఆ వితర్కాన్ని రచయిత ఇంత అందంగా చెపుతాడు. "ఆ బాలిక అందం హిమాచల శృంగ స్వరూపమైనది. ఆమె హృదయం వజ్రాయుధపు తునకలు కరిగించి పోతపోసి ఉండవచ్చును. సూర్య బింబాన్ని కొమరితకై తురిమినప్పుడు ఆ తురుముడు పోగుచేసి ఆమెమెదడు చేసిఉంటాడు దాత. ఆమెలో రక్తం ప్రసరిస్తూ ఉంటుందా లేక కరిగించిన సూర్య కిరణాలు ప్రవహిస్తూ ఉంటాయా?"

అయితే-ఒకవైపున రాజ్య విస్తరణ కాంక్షలూ, యుద్ధోన్మాదమూ, జైత్రయాత్రలూ, రాజకీయ పు ఎత్తులూ, వీటన్నింటితోనూ చరిత్రాంశం నవలలో సాగిపోతూనే ఉంటుంది. చరిత్ర కథనంతో పాటు అంత స్వాతంత్ర్యంగా-స్థాణు సదృశంగా ఉన్న శాంతిశ్రీ హృదయం క్రమంగా కుసుమ కోమలంగా వికసించడం ఎంతో కళాత్మకంగా ఆవిష్కరింప చేశారు రచయిత. చల్లని తుషార బిందువు చిందినంత సుకుమారంగా ఆమె ఆర్ద్రానుభూతిని అభివర్ణిస్తాడు బాపిరాజు-తానున్నూ సుకుమార హృదయుడు కనుక. కవి కనుక, అదీ ఆయన మాటల్లోనే ఇక్కడ చెప్పుకొనడం సబబు.

క్రొత్తగా విచ్చుకొంటున్న మొగ్గ శాంతిశ్రీ ఇలా అనుకొంటుందట. "ఈ దినాన పాటకై తన హృదయం పొద్దు పొడుపు పూవులా తిరిగిందే!" లోకంలో ఆనందం వెన్నెలలా ప్రతి వస్తువునూ స్పృశిస్తుంది- అన్న సత్యం ఆమెకు గోచరించింది.

అయితే - ఆమెలో ఉదయించిన ప్రణయ భావనా ప్రకృతి- తనకు తెలియకనే శత్రురాజైన పులమావిపైకి శక్తిస్వరూపంగా విజృంభించటం ఒక చిత్రమైన సన్నివేశంలో కల్పించడంతో కథ మలుపు తిరుగుతుంది. పులమావి అక్రమంగా శాతవాహన సింహాసనం అధిష్టించాలని చూస్తాడు. శాంతిశ్రీని చేపట్టాలని చూస్తాడు. పైపెచ్చు రాయబారిగా వెళ్ళిన బ్రహ్మదత్తుని బంధిస్తాడు. అప్పుడు అహింసావాదిని, అర్భకురాలు అయిన శాంతిశ్రీ పులిపిల్లవలె ముందుకు ఉరికి యుద్ధసన్నద్ధురాలు అవుతుంది. శాంత ప్రకృతిని మాత్రమే ఎరిగిన ఆ అమ్మాయికి అంతటి ధైర్యసాహసాలు ఎట్లా కలిగాయో! అహింసావాదిని అయిన ఆమె కృపాణం ధరించి యుద్ధ రంగంలోకి ఎట్లా ఉరికిందో! ఇది భావుకుడైన రచయిత కల్పించిన చిత్రమైన సన్నివేశం అని మనకు అనిపిస్తుంది కాని, ఆలోచించినమీదట ఇందులో అసహజమైన కల్పన ఏమీ లేదనే సత్యం గోచరిస్తుంది. అవసరమైతే స్త్రీ శక్తిరూపిణిగా మారటం సహజమనే విషయం నిరూపిస్తుంది. అవసరంపట్ల, ప్రణయశక్తి ప్రళయశక్తిగా మారటం అసంభవం కాదు-అనటానికి ఇది తార్కాణం.

స్త్రీని చాలాచోట్ల అద్భుత సౌందర్యమూర్తిగా, కుసుమపేశల శరీరిగా, ముగ్ధబాలికామూర్తిగా, వర్ణించిన బాపిరాజు ఈ సన్నివేశ వర్ణనలో తన కలానికి పదును పెట్టుకొన్నాడా అనిపిస్తుంది.

సర్వ మహిళా సైన్యం కత్తిపట్టి యుద్ధరంగంలోకి ఉరికింది. "మన మహిళలమే యుద్ధానికి వెళ్ళి ఒక అధర్మపరుణ్ణి, రాక్షసుణ్ణి ఓడించబోతున్నాము"- అంటూ

ఒకరినొకరు ప్రోత్సహించుకొంటారు. రెండువేలమంది అశ్వసాహిణుల మూడువందలమంది రథిక రమణీ బృందము, నాల్గువేలమంది పదాతినులతో వీరనారీసైన్యం బయలుదేరిందట. ఆంధ్రవీరాంగనలు మహాసౌందర్యవతులు-దిట్టరులు- అంటూ ఆంధ్ర స్త్రీలను సంభావిస్తాడు రచయిత. ఈ వీరనారీ యుద్ధవర్ణన ఈ నవలలోని కొసమెరుపు. కొలికపూస వంటి ముఖ్య ఘట్టం.

యుద్ధం ముగిసి, పులమావి హతుడై, శాంతిమూల మహారాజు శాతవాహన చక్రవర్తిగా ఎన్నుకోబడటంతో ఈ నవలలోని కథాంశం ముగుస్తుంది, ఆచార్య నాగార్జున దేవుడు శాంతిమూల మహారాజును సార్వభౌమునిగా ప్రతిష్టిస్తాడు. రచయిత ఎన్నుకున్న చారిత్రక కథ ఇంతటితో ముగుస్తుంది.

అప్పటికి శాంతిశ్రీ మనస్సు ప్రేమ పునీతం అవుతుంది. బ్రహ్మదత్తునిపట్ల తనకు తెలియకనే పెరిగిన అనురాగ స్రోతస్విని అవధులు దాటిపోతుంది. ఆమె తన ప్రేమాభివ్యక్తిని తెలుపుకొన్న సన్నివేశాన్ని ఒక దృశ్య చిత్రం వలె చిత్రిస్తారు రచయిత. బౌద్ధ ధర్మాభిరత శాంతిశ్రీకి- ఆర్షధర్మాచరణవ్రతుడు బ్రహ్మదత్తునికీ ప్రేమబంధంతోపాటు వైవాహిక బంధం ముడి పడటంతో సర్వమత ధర్మ సంప్రదాయ సామరస్యానికి రచయిత పట్టం కట్టినట్లయింది. ఈ నవలద్వారా రచయిత ఒక ఉదాత్తమైన ఆశయ సిద్ధిని పొందారని చెప్పవచ్చు.

మత ధర్మాలను గురించీ, వర్తక వ్యాపారాల గురించీ. ఆనాటి ఆంధ్రుల నౌకా నిర్మాణ కుశలత, వైద్యవిజ్ఞానము గ్రామ జీవితము, రాజనీతి, లలితకళలు, వసంతోత్సవాలు- వీటన్నిటి గురించిన సమాచారమూ బాపిరాజు గారు ప్రసక్తానుప్రసక్తంగా చొప్పిస్తారు. ఇవన్నీ కాక తాను స్వయంగా కవి కనుక - అక్కడక్కడా గేయ రచనంకూడా చేస్తారు. నేడు నవలావిధానరూపు దిద్దుకొన్న తీరుతో పోలిస్తే - అడవి బాపిరాజుగారి రచనా శిల్పం ప్రాచీనంగా నేటి చదువరులకు తోచవచ్చు. కాని ఏ శిల్ప నైపుణి చాతుర్యం వానిదే! ఏ సర్వర సుధామాధురి దానిదే! అందుకే, రచనా శైలికి అభ్యంతరం తెలిపే

> " Integrity without knowledge is weak and useless; knowledge without integrity is dangerous and dreadful "
>
> - SAMUEL JOHNSON
>
> విజ్ఞానము కొరవడిన
> నిజాయితీ, నిరుపయోగం;
> నిజాయితీ లోపించిన
> విజ్ఞానము, అతి ప్రమాదకరం.
>
> — జంగా గోపాల్

కన్నా, రచయిత బహుముఖ పాండితీశేముషినీ, కళాభినివేశాన్నీ, మనం అభినందించవలసి ఉంటుందని నేను అనుకుంటాను.

స్త్రీని అసభ్యంగా చిత్రించి, అంగాంగవర్ణనం చేసే కొన్ని నేటి రచనలతో పోలిస్తే-అడవిబాపిరాజు అమ్మాయిల అందాన్ని-ఎంతసున్నితంగా వర్ణించాడో అనిపిస్తుంది ఈ వాక్యాలు చదివితే-

" ఈ బాలిక ఎంత అందంగా ఉంది! కృష్ణానది కెరటంకాదు కదా! ఈమె వసంతవనంలో పూచిన పూవులన్నీ ఒకచోట ప్రోగు చేసినట్లుగా ఉంది! "

ఇట్లా సాగుతుంది అడవి శాంతిశ్రీ నవల. అసలు ఈ అడవి అనే ఇంటి పేరు ఏమిటి? అడవి బాపిరాజు అడవి శాంతిశ్రీ అనే నవల ఎట్లా వ్రాసారు-అని మొదటగా జిజ్ఞాస కలిగింది నాకు. అందుకు సమాధానమూ ఈ నవలలోనే దొరికింది.

" అడవులను సస్యశ్యామలంగా, బహుజనా కీర్ణంగా చేశారు కనుక సాంఖ్యాయనులకు అడవివారు అనే బిరుదు వచ్చింది. వీరే విజయపురమును నిర్మించారు. శ్రీశైలంలో మల్లికార్జునదేవుని ప్రతిష్ఠించారు. " అంటూ వివరణం ఇచ్చారు రచయిత.

ఆ వంశములోనివాడైన అడవి బ్రహ్మదత్తుని వివాహం చేసుకుని ఆమె అడవి శాంతిశ్రీ అయినది. ఈ నవలా రచనంతో బాపిరాజు అక్షరాలా అడవి బాపిరాజు అయి సార్థకనాములు అయినారని నాకు అనిపించింది.

# రంజనిమాల

: సంకలనం :
వి. ఫణీంద్రుడు

ఈ దిగువ నీయబడిన ఆధారములతో (ఈ పేర్లని/మాటని) రంజనిమాలను పూరించండి :

1. కాలు 2. కావ్య 3. అజిత 4. ఇతర 5. ఉగ్రుడు 6. తక్షుడు 7. సుజాత 8. అర్జునుడు 9. అంజనావతి 10. తంత్రీపాలుడు 11. దుర్యోధనుడు 12. ధర్మరథుడు 13. నాథవరుడు 14. అంధకాసురుడు 15. కాశీవదాదులు 16. తారకాసురుడు.



## అడ్డం

1. ఈశాన్య దిక్కునుండెడి నాడు ఏనుగు
4. జనమేజయుని భార్య
5. దీర్ఘతముని సంతానం
8. సగరుని పుత్రులలో నొకడు
9. పాండవ మధ్యముడు
10. ఏకపాదుని భార్య; అష్టావక్రుని తల్లి
12. నేమ కాని ఋషి భార్య
13. బ్రహ్మ పుత్రుడు (కోపంతో) రాక్షస సంహారి

## నిలువు

1. సింహికా విప్రచిత్తుల కుమారుడు చీకటి రాక్షసుడు:
2. సింధుద్వీపుని తండ్రి బ్రహ్మలా బొడ్డు నుండి జన్మించాడు :
3. విరాటపర్వంలో సహదేవుడు పాలు తాగినవాడా :
4. శరీరాంగానికి ప్రథమావిభక్తి ఉంటే భైరవులలో నొకడు
6. కౌరవరాజు శుభాంగిని ఎత్తుకుపోయాడు.
7. కుమారస్వామి హతమార్చిన వజ్రాంగుని కుమారుడు
9. ద్రౌపది కాని పాంచాలి; కాశీ నరపతి కన్యక
11. భరతుని పుత్రుడు

---

సెప్టెంబరు రంజనిమాల సమాధానములు

అడ్డం : 1. అంగారకవారం 6. జట్టు 7. గర్భగుడి 8. రుజని 9. నల్లి 10. వైణికులు 12. కాటుక 14. రవిక 15. వంచకి 16. రసాలు 18. పారాణి 19. చప్పట్లు 20. ఆయతనం.

నిలువు : 1 అంగరంగ వైభవం 2. రజని 3. కట్టు 4. రంగవల్లి 5. గగురుపాటు 11. కునుకుపాట్లు 12. కాకర 13. కలలు 14. రమణి 17. సామెత.

---

# సాధు సాంగత్యము

**హైందవమున** 'సాధువుల' కొక ప్రత్యేక స్థానమున్నది. 'సాధూనాం దర్శనం పుణ్యమ్' అను సూక్తిని పరికించినపుడు వారి దర్శన మాత్రమునఁ బుణ్యము గల్గునని తెలియుచున్నది. కేవలము వేష ధారణచే సాధువులుగాఁ గనిపించు వారు చాల మంది యుందురు. అట్టి అడంబరములు లేకయే శాస్త్రవాణి నిర్ణయించు 'సాధువులు' చాల తక్కువగా నుందురు. వీరొక జాతియందే యొక వంశమందే యొకే చోట జన్మింతురని చెప్పరాదు. ప్రపంచమందంతట నిట్టి మహనీయులక్కడక్కడ నుదయింతురు.

'సాధు' శబ్దమునకు "సాత్వికమగు" "మంచి" యను నర్థములు చెప్పవలసియున్నది. గోవు సాధు జంతువని మనమనుచుందుము. ఈ యుపమానము సాధువులకుఁ జక్కఁగా నన్వయించును. ఆవు మానవులకు పనికిరాని గడ్డిని తిని అమృతతుల్యమగు పాలను మనకొసఁగు చున్నది, అట్లే సాధుపురుషులు నియమితాహార విహారులై నిరంతరము ఆత్మోద్ధరణకుఁ దపించుచు, త్రికరణముల బరిశుద్ధులై లోకమునకు శాంతిని, చక్కని అదర్శమును జూపుచుందురు. వీరు, జాతి, మత ప్రాంతముల కతీతులైన సత్యకాములైయుందురు. సమదర్శనులై ప్రవర్తింతురు. వారి దృష్టిలో బంగారము, మట్టిసమానము. వారి హృదయమున గాలించి చూచినపుడు ఏ లౌకిక వాంఛలు కానరావు, తమలోని ఆత్మేశ్వరుని జూచి యానందించుచుందురు. వారి చూపులో సర్వము ప్రేమమయముగా జగత్ప్రభు మయముగాఁ గానవచ్చును.

ఇట్టి సాధువులొకప్పుడు భయంకరారణ్యములలో తపస్సు గావించుచుఁ బ్రపంచ గమనమును బట్టించుకొనక యుండెడి వారని పురాణముల యందుఁ జూతుము. వారినే ఋషులని, మునులని పిలిచెడివారు. ఈనాడును కొందఱు సాధుపులాత్మాన్వేషణలోఁ గొన్ని యాశ్రమము లేర్పాటు గావించుకొని, అందు తపోనిరతులుగా నున్నారు. అట్టివారు పూర్వమీనాఁడును సంసారుల నుద్ధరించుటకు అటనటఁ బర్యటించుచు సాత్వికాహారులై భగవద్ధ్యాన తత్పరులై మాయాంధకారమున మునిఁగి తేలు ప్రజలకు హితోపదేశముల నందిచ్చుచుందురు. వారు బహిరంతస్సత్త్వములలోఁ బరిశుద్ధులు కావున అట్టి వారిని దర్శించుట వలనఁ బుణ్యము కల్గుననుటలో వారి ప్రబోధము వలన నాత్మశక్తి వలన మనలో భక్తిజ్ఞాన వైరాగ్యము లుదయించునని చెప్పుకొనవలసియున్నది.

**డా॥ చేబోలు చిన్మయబ్రహ్మకవి**

మానవులెంత గొప్పవారయినను వారీశ్వరసేవాను రక్తులు గానినాఁడు వారు నిష్ఫల జీవనులగుచున్నారు. ఆధ్యాత్మిక భావన – సిరిసంపదల కన్న గొప్ప పదవుల కన్న గొప్పది యను భావము లేనపుడు మన మజ్ఞానము లోనే యున్నామనుకొనవలెను.

ఉత్తమ సాధువులను గుర్తించుట చాల కష్టము. "ధన కాంక్షగాని రాగద్వేషములుగాని రవంతలేని వారు" కోటికి నూటికొక్కరిద్దరు కనిపింతురు. ఈ విచక్షణ జ్ఞానముతోఁ బరిశీలించినపుడే అట్టివారిని దర్శింపఁ గల్గుదుము. ఈ వివేకము మనకున్నదని గ్రహించిన వారు మనయందు దయ దలచెదరు. పరమ రహస్యమగు పరమార్థమును గూర్చి చెప్పుదురు. నిష్కళంక జీవితమును సాగింపుఁడని యాశీర్వదింతురు. ఎంతో సుకృతము గావించిన వారికే అట్టి సాధు పురుషుల సందర్శనము లభించును. తన్మూలముగా తమ జన్మ-సఫలీకృతమగును

వివేకానందునకు రామకృష్ణుడను పరమ గురువు లభించుట వలననే అతడు చరితార్థుడగుటయే కాక లోకమునే చరితార్థమొనర్చినాడు.

నిజమైన సాధువులు-బాహ్యాండంబరముల నొల్లని గుణవంతులను, వైరాగ్యవంతులను భగవదార్తిగల వారినే తమ చెంతకు జేర్చుకొందురు. ఒకే తత్త్వ పిపాసగల గురు శిష్య సమాగమము మనోజ్ఞమైనదని వేఱుగా జెప్పవలెనా?

స్వార్థ పిశాచ మీయాధ్యాత్మిక ప్రపంచమున బ్రవేశించి "సాధు" పదమునకు గల మహోన్నతిని మంట గలుపు చుండుట మనము చూచు చున్నాము. నరులను నారాయణులను జేయ బూనిన సాధు లోకమున జిత్తశుద్ధి లోపించుట దేశదౌర్భాగ్యము కాదా? అజ్ఞులైన శిష్యులీపరిస్థితులలో బాగుపడుటకు బదులు నిరాశాహతు లగుచున్నారు.

-0~0~0-

శ్రీ గురూజీ చెప్పిన కథలు

# పొరుగువారిని ప్రేమించు

నేను ఒకసారి కొద్దిరోజులు బొంబాయిలో ఉన్నాను. అది పెద్ద భవనం. అనేక కుటుంబాలవారు అందులో నివసిస్తుండేవారు. అన్ని వాటాలలో ఉండేవారు నడవడానికి వీలుగా వరండా ఉంది. నేను ఉంటున్న వాటాకు రెండు వాటాలవతల కొత్తగా పెళ్ళయిన దంపతులు ఉంటున్నారు. భర్త ఉద్యోగం కోసం బయటికి వెళ్ళేవాడు. ఆమె ఇంటిపని చేసుకుంటూ వరండాలో అటు యిటు తిరుగుతుండేది. నేను కేవలం స్నానం కోసం మాత్రమే ఇంటికి వస్తుండేవాడిని. నేను ఒక రోజు ఇంటికి వచ్చేటప్పటికి ఆమె కనిపించలేదు. వారి వాటా తలుపు మూసి ఉంది. నేను వారిని గురించి నేను ఉంటున్న ఇంటి యజమానిని అడిగాను. "నాకు తెలియదు" అన్నాడు. "అడిగి తెలుసుకోండి" అన్నాను. "ఎనిమిది గంటలు దాటుతోంది. పాలు, కూరలు మొదలైన వాటికోసం అయినా వారు బయటకు రావాలి కదా! ఎందుకు రాలేదు?" అంటూ నా అనుమానాన్ని వెల్లడించాను. అది విని ఆయన "ఎందుకండీ అనవసరమైన విషయాల్లో తల దూర్చుతారు? వాళ్ళ సంగతేదో వాళ్ళకు తెలుసు" అంటూ చిరాకు ప్రదర్శించాడు.

"దానిని ఇతరుల విషయాలలో తలదూర్చట మనరు. అది ఇరుగు పొరుగువారిపట్ల మనకుండే కర్తవ్యము" అన్నాను. ఆయన "బొంబాయిలో మా జీవన విధానానికి ఒక అంతస్తు వుంది. దానిప్రకారం ఇతరుల విషయంలో జోక్యం కలిగించుకోరాదు" అని సమాధానం చెప్పాడు.

నేను వారి ఇంటికి వెళ్ళాను, తలుపు తట్టాను, ఎవ్వరూ పలుకలేదు, మెల్లగా తలుపు నెట్టాను, తలుపు తెరుచుకుంది. లోపలి దృశ్యం నన్ను నిశ్చేష్టుణ్ణి చేసింది. ఆ ఇంటిలోని యువకుడు కొద్ది రోజులుగా అనారోగ్యంతో బాధ పడుతున్నాడట. ఆ రాత్రే హఠాత్తుగా మరణించాడు. అతని భార్య ఏడుస్తూ శవం ప్రక్కనే కూర్చొని ఉంది. నేను ఆమెను సమీపించి, వారి బంధువులను గురించి వివరాలు తెలుసుకున్నాను. వారందరికి వార్త పంపించి, వారు రాగానే తిరిగి నా పనిలో నిమగ్నుడనయ్యాను.

ఇదీ నేటి సమాజ పరిస్థితి. పొరుగువారిపట్ల ఆత్మీయత లేదు. అట్లా లేకుండా ఉండటం ఉన్నత జీవన ప్రమాణానికి కొలబద్దగా భావిస్తున్నాము. ఈ పరిస్థితి మారిపోవాలి. ఆత్మీయతాభావనను సమాజంలో నిర్మించడమే గొప్ప సమాజసేవ. ఈ భావం కొఱబడిన కారణంగానే మనం వికలాంగుల కోసం, నిరక్షరాస్యుల కోసం, నిర్భాగ్యులకోసం వేర్వేరు పథకాలను రూపొందించవలసి వస్తోంది. ('కథాకల్పతరువు' నుండి)



# హాస్య వాణి

వాసు

## నవ్వితే నవ్వండి

నిద్రలేచేసరికి గుర్నాథానికి ఒళ్ళంతా నెప్పిగా, తలంతా పోట్లు పొడుస్తున్నట్టు అనిపించింది. ఈ పరిస్థితిలో ఆఫీసుకి వెళ్ళి పనిచేయటం కష్టమని శెలవు పెట్టాలనుకున్నాడు.

ఇంతలో గేదె తన్నింది కాబట్టి పాలు రావన్నాడు పాలవాడు. మరేదో కారణంతో పనిమనిషి ఎగ్గొట్టింది. మున్సిపాలిటీవారి పంపులోంచి వచ్చే చుక్కల కోసం ఎదురుచూస్తున్నది శ్రీమతి. మరో పది నిముషాలయ్యేసరికి కాలింగ్‌బెల్ మోగింది. తలుపు తీస్తే భార్య తాలూకు బంధువులు నలుగురు దిగారు.

శెలవు ఆలోచన మానుకొని రోజుకన్నా గంట ముందే ఆఫీసుకు బయలుదేరాడు గుర్నాథం.

## ప్రముఖుల హాస్యం

మునిమాణిక్యం నరశింహారావుగారు బందరు హిందూ కళాశాలలో పనిచేస్తున్న రోజుల్లో ఒకరోజు విద్యార్థులు హఠాత్తుగా సమ్మె మొదలు పెట్టారు. కుర్రాళ్ళు కాలేజి కాంపౌండ్ వాల్ మీద కూర్చుని కారుకూతలు కూస్తున్నారు.

మునిమాణిక్యం గారికి కాఫీ తాగాలనుంది. బయటకు వెళితే, కుర్రాళ్ళు ఏమన్నా కామెంట్స్ చేస్తే బాధ పడాల్సివస్తుందేమోననే భయం. కొద్దిసేపు ఓపిక పట్టారు. ఇక ఆగలేక ఆలోచించి తోటి ఉపాధ్యాయుడు శ్రీ కోసూరి నారాయణరావు గారిని తోడు రమ్మన్నారు.

" నేనెందుకయ్యా వెంట " అని నారాయణరావుగారు ప్రశ్నిస్తే-

" బయటకు వెళితే కుర్రాళ్ళు ఎలాగూ ఏదో ఒకటి అనకుండా వూరుకోరు. ఒంటరిగా వెళితే ఆ కామెంట్స్ అన్నీ నామీదే అనుకోవాలి. నీవు పక్కన వున్నావనుకో ఆ కామెంట్స్ నీమీదనుకొని నేను నా మీదఅనుకుని నీవు హుషారుగా వెళ్ళిరావొచ్చు " - ఇది నరశింహారావు గారి సమాధానం

## ప్రభుత్వ ఆఫీసులో పనితీరు

పదకొండు గంటలవరకు ఉద్యోగస్తులు కుర్చీల్లో చేరటం.
యోగక్షేమాల పరామర్శలు.
పన్నెండు గంటల వరకు కేంటీన్‌లో టీ.
ఏ ఫైలు ముట్టుకోవాలా అని ఆలోచన.
ఒంటిగంటవరకు పనిచేస్తున్నట్టు నటన. లంచ్‌కి లేవటం
రెండు నుండి మూడింటి వరకు ఫైల్ చూడటం.
మూడు నుండి నాలుగు వరకు తిరిగి కేంటీన్‌లో టీ.
నాలుగింటి నుండి ఫైల్స్ సర్దటం.
అయిదింటికి ఠంచన్‌గా ఇంటికి.

## నిత్య సత్యాలు

* ఆరోగ్యం సంపదకన్నా విలువైనది.
* అప్పు యివ్వవద్దు, తీసుకోవద్దు.
* నిస్వార్థ సేవలో ఎంతో ఆనందం వున్నది.
* రెండు నాలుకల మనిషిని ఎవరూ నమ్మరు.
* నీతిగలవారే సంతోషంగా వుంటారు.
* ఇతరులను గుడ్డిగా అనుసరించవద్దు.
* పుట్టిన మనుష్యుడు గిట్టక తప్పదు.
* ఒకసారి గడిచిపోయిన కాలము తిరిగిరాదు.
* సోమరి సగం చచ్చినవాని క్రింద లెఖ్ఖ.
* దురలవాట్లను మొగ్గలోనే త్రుంచివేయాలి.

హాస్పిటల్ ముందాగిన జీప్‌లోంచి దిగిన ఎస్. ఐ. భరద్వాజ లోపలకి నడిచాడు.

అక్కడ ఎంక్వయిరీ చేసి ఆలేఖ్య వున్న వార్డువైపు నడిచాడు.

అప్పుడే డాక్టర్ ఆ రూమ్‌లోంచి బయటకి వస్తున్నాడు. అక్కడేవున్న కానిస్టేబుల్స్ భరద్వాజని చూడగానే సెల్యూట్ కొట్టారు.




" ఎక్స్క్యూజ్‌మి డాక్టర్ ఇప్పుడు మీరు చూసిన పేషెంట్ కండిషన్ ఎలావుంది ? "

" షీ ఈజ్ ఆల్‌రైట్ బట్ ఆమె ఇంకా స్పృహలోకి రాలేదు. ఎందుకంటే ఆమె మెడమీద ఎవరో బలంగా కొట్టడంతో ఆమె స్పృహ కోల్పోయింది " అన్నాడు డాక్టర్.

" అంటే ఆమె స్పృహలోకి రావటానికి ఎంత టయిం పడుతుంది ? "

" ఈ రాత్రికల్లా స్పృహలోకి వచ్చేస్తుందామె. "

" ఓహో రేపటి దాకా ఆగాలన్నమాట. థ్యాంక్స్ డాక్టర్. కెన్ ఐ సీ ద పేషెంట్."

" ఇట్సాల్ రైట్. మీరు ఆమెని చూడొచ్చు. అయితే ఆమెను మీరు డిస్టర్బ్ చేయొద్దు సుమా " అంటూ భరద్వాజతో కరచాలనం చేసి డాక్టర్ తన డ్యూటీకి వెళ్ళిపోయాడు.

నర్స్ ముందు దారి తీయగా ఆమె వెంట అలేఖ్య వున్న రూంలోకి దారి తీసాడు భరద్వాజ.

బెడ్ మీద నిస్తేజంగా పడివున్న ఆమెని చూడగానే ఒక నిట్టూర్పు విడిచాడు. తరువాత రూంని గమనించ సాగాడు.

రూం కొద్దిగ విశాలంగా బాగానే వుంది. తలుపుకు కొంచెం అవతలగా ఆమె బెడ్ వుంది. ఆమెచేతికి సిలెన్ ఎక్కిస్తున్నారు. ఆమె తలపైపు ఒక పెద్ద గ్లాస్ విన్డో వుంది. దానికి కిటికీ ఊచలు కాని ఏమీ లేవు. ఎంట రయ్యే డోర్‌కి అద్దం లాంటిది వుంది లోపల జరిగేది చూట్టానికి వీలుగా వుంది.

నర్స్‌తో జాగ్రత్తగా చూస్తుండమని చెప్పి బయటికి వచ్చాడు భరద్వాజ. కానిస్టేబుల్స్‌ని ఎలర్ట్‌గా ఉండమని చెప్పాడు. అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు యస్ ఐ. భరద్వాజ.

* * *

పెద్ద బంగళా చుట్టూ అందమయిన పూల తోట. దాని చుట్టూ పెద్ద ప్రహరీగోడ.

లోపలకి ప్రవేశించటానికి పెద్ద గేటు. ఆ గేటు దగ్గర ఒక గూర్ఖా. ఆ గేటు నుంచి లోపలకి దారి చూపుతూ క్రమ పద్ధతిలో అమర్చిన పాలరాళ్ళు.

ఆ దోవగుండా లోపలకి వెళ్తుంటే ఆ దోవ ఒక చీలిక కారుషెడ్‌కి దారితీస్తుంది. గుమ్మం దగ్గర ఎగిరిపోవ టానికి సిద్ధంగా వున్న రాయంచలు రెండు. ఆ ఇంట్లో వాళ్ళ కళాదృష్టికి చిహ్నంగా వున్నాయి. ఆ తోటలో ఆ ప్రాంతంలో లేని మొక్కలు చాలా వున్నాయి. తోట

(జరిగిన కథ)

హాల్లో ప్రవేశించిన భరద్వాజకి మొదట పరిస్థితి ఏమీ అర్థంకాలేదు. యస్. ఐ. కళ్ళకి అచేతనంగా పడివున్న ఆ లేఖ్య కనిపించింది. ఆమెని తక్షణ చికిత్సకోసం హాస్పిటల్‌కి పంపి అక్కడున్నవారిని ఆ హత్యల విషయమై విచారణ చేసాడు యస్. ఐ. భరద్వాజ.

(ఇక చదవండి)

మధ్యలో ఫౌంటెన్. అక్కడ అణువణువు సిరి తొణి కిసలాడుతుంది.

ఆ రాయంచల మధ్యలోంచి ఇంట్లోకి వెళ్తే తాము ఇంద్రభవనంలోకి వెళ్ళామా అన్న అనుభూతి కలుగుతుంది.

" చూసారా అలేఖ్య నాతో భక్తశిరియాళ సినిమాకి రమ్మంటే రాను పొమ్మని వాళ్ళ స్నేహితుల ఇంటికి వెళ్తుందా? అదే మాకాలంలో అయితే ఇలాంటి వేషాలు వేసామా.... చూసామా.... హవ్వ".... అంటూ ఆయాసపడి పోసాగారు పార్వతమ్మగారు.

ఆమెకి సుమారు నలభై ఐదేళ్ళ వయసుదాకా వుంటుంది. మనిషి, మనసు రెండూ తెల్లగానే వుంటాయి. మనసులో ఏ విషయం దాచుకోలేని ఒట్టి భోళామనిషి.

తనతో కూతురు సినిమాకి రాలేదన్న ఉక్రోషంతో ఆమె ఆయాసపడుతూ అరుస్తోంది.

"ఏంటండి ఇందాకనుంచి చూస్తున్నా, గొంతు చించుకొని చెపుతున్నాను? అసలు ఏం పట్టించుకోరే" అంది తను ఇన్ని చెపుతున్నా పేపర్లోంచి తల ఎత్తని భర్తని చూస్తూ.

"ఆఁ రోజూ ఉండే భారతమే కదా ఇది ఏంవింటాం" అన్నారాయన పేపర్లోంచి కనీసం తలకూడా పైకెత్త కుండా.

'భారతం' అన్నమాట ఆమె చెవిన పడగానే, "ఔనండీ భారతం ఏం గ్రంథమండీ, అందుకే అన్నారు-వింటే భారతం వినాలని తింటే గారెలు తినాలని. ఊరికే అన్నారా!" అంటూ అరమోడ్పు కన్నులతో రెండుచేతులూ జోడించిందామె.

పార్వతమ్మగారు పాతకాలపు మనిషి. పురాణాలన్నా, కథలన్నా చెవి కోసుకొనే మనిషి అందుకే. ఆ ఇంట్లో ఆమెకి కోపం వస్తే రామాయణం అనో భాగవతం అనో తప్పించుకుంటూ వుంటారు.

పార్వతమ్మగారి భర్త పేరు సత్యనారాయణగారు.

ఆలేఖ్య ఒడ్డూ పొడుగంతా తండ్రి పోలికే, రంగూ కనుముక్కు తీరు తల్లి పోలికే.

సత్యనారాయణగారు ఆ నగరంలో పెద్ద బిజినెస్ మాగ్నెట్. అయితే ఆదివారాలలో మాత్రం అయన ఇంట్లోంచి బయటకి వెళ్ళరు. ఇంట్లో ఆ రోజు భార్యతోను, కూతురితోను సరదాగా గడుపుతారు.

ఆలేఖ్య వారి ఒకానొక్క బిడ్డ, ఆ లక్షల ఆస్తికి ఏకైక వారసురాలు.

ట్రింగ్—ట్రింగ్— ట్రింగ్— అంటూ మ్రోగుతున్న టెలిఫోన్ కేసి విసుగ్గా చూసారాయన.

అయనకి సెలవు రోజుల్లో బయటికి వెళ్ళటమంటే చిరాకు. అందుకే ఆ రోజు ఏ ఎంగేజ్‌మెంట్స్ పెట్టుకోరు. అయనింటికి ఆ రోజు ఎటువంటి ఫోన్‌లు రావు మరీ అర్జెంటయితే తప్ప.

ట్రింగ్—ట్రింగ్— అలా నిర్విరామంగా మోగుతున్న ఆ ఫోన్‌కేసి విసుగ్గా చూసి రిసీవర్ తీసుకున్నారు,

"హలో సత్యనారాయణ స్పీకింగ్"

"హ్హా—హ్హా—స్పీకుతావయ్యా స్పీకుతావు. పనా పాటా! లక్షల ఆస్తి తింటూ ఇంట్లో కూర్చొని వాగటమే కదా నీ పని."

"వ్వాట్—వ్వాట్ నాన్సెన్స్ యూ అర్ టాకింగ్, ఎవరనుకున్నావు నేను బిజినెస్ మాగ్నెట్ సత్యనారాయణని మాట్లాడుతున్నా" అన్నారాయన ఆవేశంతో ఊగిపోతూ.

"ఏరా నువ్వు బిజినెస్ మాగ్నెట్‌వా? నీ జాతకం తారుమారు చేస్తారా? నీ కూతురు ఆలేఖ్య ఏ పరిస్థితులలో వుందో తల్సుకోరా? ఏరా ఈ షాక్ చాలా? ఉంటా" అంటూ టక్కున పెట్టేసాడతను.

ఒక్కసారి స్టన్నయిపొయ్యాడాయన. చివరి మాటల్లు ఆయన్ని విపరీతంగా కంగారుపెట్టాయి, "ఏంటి నా చిట్టితల్లి కేమయింది. వాడు కిడ్నాప్‌గాని చెయ్యలేదు కదా!" అంటూ అయన పరిపరి విధాల పోతున్న మనస్సు అదుపులో పెట్టుకుంటూ చుట్టూ చూసారు భార్య కాని ఉందేమో అని.

అమె ఫోన్ మోగటం చూసి అక్కడ్నుంచి వెళ్ళిపోయిందావిడ.

ఆమె కనుక ఇది వింటే అసలే హార్ట్ ఎటాక్ పేషెంట్ తట్టుకోలేదు అనుకుంటూ ఏదో నిర్ణయానికి వచ్చినవాడిలా ఫోన్‌మీద చెయ్యి వేసారాయన.

అంతలో—

ట్రింగ్—ట్రింగ్—అంటూ మళ్ళీ మ్రోగసాగిందా ఫోన్.

గబుక్కున చెయ్యి వెనక్కి తీసుకున్నారాయన. ఎర్రగా వున్న ఆ టెలిఫోన్ మరింతగా భయపెట్టసాగిందాయన్ని.

భయం భయంగా చూడసాగారు ఆ ఫోన్‌వంక ఇంకా ఏ దుర్వార్త వినాల్సివస్తుందోనని.

నెమ్మదిగా ఒణుకుతున్న చేతుల్తో రిసీవర్ తీసుకొని గబుక్కున చెవి దగ్గర పెట్టుకున్నారాయన.

"హ్హా—హ్హా—ఒరేయ్ నీపాలిట యముడ్నిరా."

(సశేషం)

# పుస్తకసమీక్ష

పుస్తకం పేరు : **నాకు జ్ఞాపకం ఉంది**

రచయిత : **శ్రీ మాదిరాజు రంగారావు**

వెల : ఐదు రూపాయలు

ప్రతులకు రసధుని ప్రచురణలు, క్వార్టర్ నెం. 14
కాకతీయ విశ్వవిద్యాలయం,
విద్యారణ్యపురి, వరంగల్-9

"**ఎంతటి** వెలుగులోనూ మనస్సు, ఏదో సమస్యను పట్టుకునే ఉంటుంది. ఏదో వలయాన్ని చుట్టుకునే ఉంటుంది, సుదీర్ఘమై, కథలో ఉప కథల సంబంధంతో"-

ఇలాంటి మనసుతో సంస్కారం గల ఒకవ్యక్తి బాహ్య జగత్తులో కొన్ని గంటలు గడిపితే, వస్తువుల తాకిడికి జనించే ఉద్రేకాలవల్ల, సౌందర్యం, ఆధ్యాత్మిక చింతన వంటి అనుభూతుల తీవ్రత వల్ల అస్పష్టమయిన సంఘర్షణకు గురయితే గమ్యస్థానంలేని ప్రవాహంలాగా భావాలు విచిత్రమైన భాషలో కదలిపోతాయి. దీనినే "చైతన్య ప్రవంతి" (Stream of Consciousness) అంటారు. బుచ్చిబాబు దీనిని గురించి వివరిస్తూ "అరాచకంగా కనపడే లోకంపోకడ నుండి కొన్ని సూత్రాలను విడదీసి, కళానుగుణమైన దృక్పథంతో ఒక ఆకృతిలో కేంద్రీకరించి, తీక్షణమైన శైలిలో ప్రదర్శించటం సంప్రదాయ బద్ధమైన సారస్వత కళ లక్షణం. విభజనలో, వడబోతలో సత్యం దెబ్బతింటుంది. గాన వున్నదున్నట్లు మొత్తం అనుభవాన్ని చిత్రించాలి అన్న ఆదర్శం ఈ ధోరణికి మూలం" అంటారు.

శ్రీమాదిరాజురంగారావు గారి "నాకు జ్ఞాపకంఉంది" అనే కావ్యం అలాంటి ప్రయోగమే. కవి ప్రయాణం మొదలు పెట్టిన తర్వాత కొన్ని గంటల్లో పొందిన అనుభవాలను అక్షరతోరణంగా గుచ్చుకుంటూ వెళ్తాడు. "బస్ కదులుతోంది, బరువుగా, మృదువుగా" అంటూ ప్రయాణం తాలూకు అనుభూతులను చెప్పటం మొదలు పెడతాడు. ఇక ఆ తరువాత కలగాపులగంగా భావాలు శబ్దరూపాన్ని పొందటానికి ఆరాట పడతాయి. "చేతికర్రపై కాల వేగాన్ని నిలుపుతూ. బస్టాండ్ ప్రక్కనే ఉన్న చెట్టు క్రిందికి" కదిలే భిక్షువూ, "చేతిలో గొలుసుకు వెనుకనే పెట్ డాగ్‌తో" వేగంగా ప్లాట్‌ఫార్మ్‌పై నడిచే యువతీ "తాష్ ఆడుతూ క్రింది పెదవినొక్కి, పైపంటితో 'దీనితో సరి' అని కార్డు తీసి" విసిరేవారూ, పగిలిన అద్దం తాలూకూ ప్రతి శకలం లోనూ, ప్రతిబింబాన్ని చూసి పోరాటానికి సిద్ధమైన పిచ్చుక, ఏడ్చే శిశువుతో, ఎవరికీ అక్కరలేని మూటతో బస్ ఎక్కిన ఆమె" - ఇలా ఎందరి రూపాలు, ఎన్ని జ్ఞాపకాలు! మనిషిలో ఆలోచనలు ఎందుకు, ఎలా ఉద్భవిస్తాయో, ఎప్పుడు ఎలా అంతమవుతాయో! తెలుసుకోవాలంటే "ఈ కావ్యం" మంచి సాధనం!

కవి ప్రవృత్తి రీత్యా తాత్త్విక చింతనగలవాడు. అందుకే "ఎరుపు తెలుపు నలుపు పసుపు వర్ణాల మిశ్రమ సంకలన చిత్రం ఈ నగరం! ఆందోళన ఉద్యమం సంస్కరణ పరివర్తనం వివిధ దృశ్య పరంపరతో నవ నాటక రంగస్థలం" అంటాడు. అలా అని, కవి విరాగిగా మనకు ఎక్కడా కన్పించడు. పైగా యూకలిప్టస్ చెట్టును ప్రేరణగా తీసుకొని, "నీడకోరే మనిషికి ఆకాశాన్ని చూపిస్తుంది" అంటాడు. "పైకి తల ఎత్తలేని వాడికి శిఖరం కన్పించదని" హెచ్చరిస్తాడు. "తన వద్ద జరిగే బలాత్కారం చూచి పూలుపూయడం మానలేదు తోట, తన నీడలో జరిగే హింసను చివురు వేయడం ఆపలేదు చెట్టు" అంటాడు. ఆకాశంలో కదిలే ప్రతి మబ్బూ స్మరింప జేస్తోంది ఆలోచనా లక్ష్యాన్ని! మట్టినుండి వచ్చే

ప్రతి మొక్క భావింప జేస్తుంది ప్రాణి "
అని ప్రబోధిస్తాడు.

కవికున్న సౌందర్య దృష్టి అనుపమేయం: కవి అంటాడూ- " ఎవరో తలుపు తట్టారు చీకట్లో, తలుపు తెరిచే సరికి ప్రత్యక్షం. మంచుశాలునా కప్పుకొని నిండా ఎర్రని కాంతి ముఖంతో దృశ్యం " "పట్టుకుచ్చుల వలె తేలికైన గాలులు, చెరువు గుండెపైనుండి, చెట్ల బుజాలపై నుండి, పచ్చపచ్చని మొక్కల తలలు నిమురుతూ, తీపెల ముంగురుల్లో వేళ్ళు దూర్చి, కపోల పాళి మీటుతూ" .... కవిని తాకుతూ అతని గుండెల్లో స్నిగ్ధంహరీ స్మృతుల్ని రేపుతాయి.

సృష్టి రహస్యాన్ని పరిపూర్ణంగా శోధించటం ఎవ్వ వల్లా అయ్యేపనికాదు. జీవితంలో చెడును, కుళ్ళును బయట పెట్టటం - " వెలుగు కోసం నిరీక్షణలో తరాలుగా యుగాలుగా వాడిపోయి జీర్ణమై బండబారిన జీవితాలను " గురించి వ్రాయటం, " ఉన్మాదంతో ప్రేలే బాంబుల మధ్య, ఉద్రేకంతో మ్రోగే రైఫిళ్ళమధ్య, ఒదిగే అమాయకుల నిశ్వాసాల మధ్య, నిశ్శబ్ద ప్రపంచం- శాంతి వచన తరంగాలు " అంటూ వాస్తవానికి అద్దం పట్టటం చైతన్య స్రవంతి కుండే ముఖ్య లక్షణాలు. ఈ ప్రయోగాన్ని " జేమ్సు జాయిస్, వర్జీనియా వూల్ఫ్, గెర్ట్రూడ్ స్టేన్, రిచర్డుసన్ " లాంటి వాళ్ళు విజయవంతంగా చేసి చూపారు. శ్రీ మాదిరాజు రంగారావు కూడా ఇందులో పరిపూర్ణ సాఫల్యాన్ని సాధించారు. నిజంగా ఇది తెలుగు కవితా ప్రియులు చదవదగ్గ పుస్తకం.

**- డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు**

# ఆత్మాభిమానం

ప్రభువుల కృపాకటాక్షవీక్షణాలకోసం అంగలార్చే వారెందరో వుంటారు. ఆత్మ గౌరవానికి ఏమాత్రం భంగం కల్గినా, నిర్మొహమాటంగా, స్వచ్ఛందంగా పదవులను వదులుకొన్న మానధనులు కూడా ఉన్నారు.

సర్ చట్టూర్ శంకరన్ నాయర్ వైస్‌రాయ్ ఎక్జిక్యూటివ్ కౌన్సిలులో సభ్యుడుగా వుండేవారు. ఆ కౌన్సిల్ సభ్యులలో అధికసంఖ్యాకులు తెల్లవారేకాని, వారందరికీ శంకరన్ నాయర్ గారంటే ఎంతో భయం.

ఆంగ్ల ప్రభుత్వం పంజాబులో సైనికశాసనం అమలు పరచింది. దాని ఫలితమే జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ. బ్రిటీష్ సామ్రాజ్యవాదుల నిరంకుశ వైఖరికి నిరసనగా శంకరన్‌నాయర్ కౌన్సిల్ సభ్యత్వానికి రాజీనామా పత్రాన్ని వైస్రాయి లార్డ్ చెమ్స్‌ఫర్డ్‌కు పంపాడు.

కనీస మర్యాదకోసం మరుసటిరోజు శ్రీ నాయర్ చివరిసారిగా వైస్రాయిని కలుసుకున్నాడు. మాటల సందర్భంగా ఆ వైస్రాయి " మీ బదులు మరెవరినైనా సూచిస్తారా ? " అని అడిగాడు.

" ఓ తప్పకుండా. అదిగో అక్కడ నుంచున్న రామప్రసాద్ " అని శ్రీ నాయర్ చెబుతారు. వైస్రాయి భవన పరిచారకులలో ఒకడు రామప్రసాద్. 'ఏమన్నారు? ' అన్నాడు విభ్రాంతుడైన వైస్రాయి.

"అవును అతడే " అంటూ మరొకమారు నొక్కి చెప్పారు శ్రీ నాయర్. " బాగా ఆలోచించే చెబుతున్నాను. రామప్రసాద్ సుప్రదూపి. మంచి ఒడ్డూ పొడుగూ గలవాడు. ఆ యూనిఫామ్ అతనికి బాగా నప్పుతుంది. అన్నిటికంటే ముఖ్యంగా మీరు చెప్పిన దానికల్లా చిత్తం హుజూర్ అంటాడు. మీకు కావాల్సింది అలాంటివాళ్ళేగదా ! "

వైస్రాయి తెల్లబోయాడు. శంకరన్ నాయర్ అనవలసినదేమో అని వైస్రాయితో సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

**– జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

( రసవద్ఘట్టాలు గ్రంథం నుండి )

# ముత్యాల సరాలు (కథ)

కవులూరి నీరద

**రెమ్మలు పరుచుకునివున్న అదే బోగన్‌విల్లా చెట్టు - యింకా పూలు పూస్తూనే వుంది. కొమ్మలు పరుచుకుని వున్న అదే గున్న మామిడి చెట్టు - యింకా కాయలు కాస్తూనే వుంది. చిల్లుల చిల్లుల ప్రహరీగోడ.**

పరీక్షగా చూస్తున్నాడు నానీ - గత ఇరవై ఏళ్ళుగా ఆ యిల్లు ఏమీ మారలేదు. ఆ యింటిలో తన బాల్యం కొంత గడిచింది. నానీ మనస్సు యిరవై సంవత్సరాలు వెనక్కి పరుగుతీసింది.

అప్పుడు తాము రాజమండ్రిలోనే వుండేవారు. నాన్నగారు పబ్లిక్ ప్రాసిక్యూటరు. తనకు ఒక అన్నయ్యా, ఇద్దరు అక్కయ్యలూ ఒక చెల్లెలూ వుండేవారు. తన అసలు పేరు ఏదైనా అందరూ తనని ' నానీ ' అని పిల్చేవారు. తనను బడిలో చేర్పించినా తను ఎప్పుడూ వెళ్ళేవాడు కాదు. ఇంట్లోనే ట్యూషన్ చెప్పించేవారు. మధ్యాహ్నంపూట నాన్నగారు ఆఫీసుకు, అన్నయ్యా అక్కయ్యలూ బడికి వెళ్ళిపోయిన తరువాత అమ్మ నిద్ర పోతున్నప్పుడు తనూ, చెల్లెలు ఆడుకుంటూనో, పోట్లాడుకుంటూనో గడిపేవారు.

ఇంటిలోకి కొత్తగా వచ్చిన ఆకర్షణ ఫోను. నల్లగా నిగా నిగా మెరుస్తూ నాన్నగారి బల్లమీద వుండేది. నాన్నగారు దానితో మాట్లాడటం, అరవటం, నవ్వటం తను ఎన్నోసార్లు విన్నాడు.

చివరికి ఒకసారి అన్నయ్యతో అన్నాడు "అదేమిటి".

" అది ఫోను. దానితో ఎవరితో పడితే వాళ్ళతో మాట్లాడవచ్చు. "

" ఎట్లాగ మాట్లాడటం "

" ఏముందీ? ఫోను - తీసుకో. అవతల 'నెంబరుప్లీజ్' అంటారు. నీ యిష్టం వచ్చిన నెంబరు చెప్పు. కనెక్షన్ యిస్తారు. మాటాడవచ్చు "

" ఏ నెంబరు చెప్పాలి? "

" నీ యిష్టం వచ్చిన నెంబరు చెప్పు. నూట ఎనభై నాలుగు చెప్పు. లేదా రెండు వందల రెండు చెప్పు " అన్నాడు అన్నయ్య.

అది తన మనస్సులో హత్తుకుపోయింది. ఒకరోజు మధ్యాహ్నం నాన్నగారు ఆఫీసుకు వెళ్ళిపోయినారు. అక్కయ్యలూ, అన్నయ్యా బడికి వెళ్ళిపోయినారు. అమ్మా చెల్లాయీ గదిలో నిద్రపోతున్నారు. తను పెన్సిల్ చెక్కుతుంటే వేలు తెగింది. వెంటనే ఫోను తీశాడు.

" నెంబర్ ప్లీజ్ ".

" నూట ఎనభై నాలుగు "

## ఓర్పు - నేర్పు

కష్టంలో సుఖమున్నది
పంకంలో పంకజం పుట్టినట్లు.
సుఖంలో కష్టమున్నది
పెక్కు సంతానం పెక్కు దుఃఖమైనట్లు.
కేవల సుఖంలో సుఖం లేదు
వెన్నెట్లో దీపం వెలవెలబోయినట్లు.
కష్ట జనిత సుఖంలో సుఖమున్నది
కటిక చీకట్లో దీపం కలకల నవ్వినట్లు.
అయితే
కష్టాన్ని నవ్వుతూ అనుభవించే ఓర్పు కావాలి!
సుఖాన్ని ఏడుస్తూ అనుభవించని నేర్పు కావాలి!

– చల్లా రాధాకృష్ణశర్మ

" హలో " అవతల ఫోనులో ఒక స్త్రీ కంఠం పలకరించింది.

" నేను పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారి అబ్బాయి నానీని మాట్లాడుతున్నానండీ. పెన్సిల్ చెక్కుతుంటే వేలు తెగిందండీ. ఏమి చెయ్యమంటారండీ" అని అడిగాడు తను.

" అక్కడ యింక ఎవరూ లేరా ? "

" అమ్మా చెల్లాయీ నిద్రపోతున్నారు " అన్నాడు తను.

" కొబ్బరినూనె రాసి తడిగుడ్డ చుట్టు "

ఆ విధంగా మొదలు అయింది ఆమెతో పరిచయం -ఫోను పిన్నితో

మధ్యాహ్నంపూట ఎవ్వరూ చూడకుండా ఆమెకు ఫోను చేస్తుండేవాడు.

" మరండీ మురళీ చెప్తాడు గదండీ ఒక ఆవు రైలు క్రింద పడిందటండీ. తను అక్కడికి వెళ్ళి చూసేటప్పటికీ పట్టాల మీద యింత పేడా, యిన్ని పాలూ వున్నాయిటండీ "

ఆమె పగలబడి నవ్వేది.

ఇంకొక రోజు తను చెప్పేవాడు. " మరండీ గోవిందూ వాళ్ళ మాస్టరు పాలు యిచ్చు జంతువు ఒక దానిపేరు చెప్పమంటే గోవిందు గుఱ్ఱం పేరు చెప్పాడటండీ. మేష్టారు కొట్టారటండీ. గుఱ్ఱం దాని పిల్లలకు అది పాలు యిచ్చుకుంటుంది గదా అన్నాడండీ వాడు నాతో."

ఆమె విరగబడి నవ్వేది.

ఇంకొకరోజు తను చెప్పేవాడు. " మరండీ వెంకటేశ్ చెప్పాడు గదండీ తిరుపతి కొండమీదకు వెళ్ళేటప్పుడు బస్సు తలక్రిందులుగా పోతుందిటండి "

" మరి జనం పడిపోరటనా ? "

" చాలా స్పీడుగా పోతుందిటండీ - జనం పడిపోకుండా "

ఆమె పగలబడి నవ్వేది.

ఆమె ఫోనులోనే ఎన్నో వివరాలు అడిగేది

" మీ నాన్నగారికి ఏం వుద్యోగం "

" మీరు అన్నదమ్ములు ఎంతమంది ?అక్కచెల్లెళ్ళు ఎంతమంది ? "

తను అన్నిటికీ సమాధానాలు చెప్పేవాడు.

ఆ తరువాత కొద్దిరోజులకే నాన్నగారికి రాజమండ్రి నుండి బదిలీ అయిపోయింది.

ఈ ఇరవై సంవత్సరాలల్లో తన జీవితంలో ఎన్నో మార్పులు జరిగాయి. అన్నయ్య ఇంజనీరింగ్ పాసై జంషెడ్పూరులో ఇంజనీరుగా స్థిరపడ్డాడు. అక్కయ్యలు పెళ్ళిళ్ళయి అత్త వారిళ్ళకు వెళ్ళిపోయినారు. చిన్నప్పుడు తనతో ఆడుకున్న చెల్లెలు యీనాడు ఒక పెద్దయింటికి కోడలై సమస్యలతో తల మునకలు అవుతున్నది. నాన్నగారు పోగానే అమ్మ తన దగ్గరే వుంటున్నది. ఎప్పుడూ పూజలతో, భజనలతో కాలక్షేపం చేస్తున్నది. తనకున్న స్నేహితులే యిద్దరు ముగ్గురు. వాళ్లు

దూర ప్రాంతాలల్లో స్థిరపడి పోయినారు. తిరిగి తన జీవితంలో ఒంటరి తనం. అదే తన ఆప్త మిత్రుడు. అదే తన అగస్త్య శత్రువు.

ఈ ఇరవై సంవత్సరాలల్లో ఎన్నోసార్లు ఫోను పిన్ని తనకు గుర్తుకు వచ్చేది. ఆమె భర్తకు ఏమి ఉద్యోగం, ఆమెకు ఎంతమంది పిల్లలు, కనీసం ఆమె పేరు ఏమిటి యే వివరాలు తనకు తెలియదు. కేవలం ఫోను పిన్ని గానే ఆమె తన మనస్సులో నిల్చిపోయింది. తన జీవితంలో ఏదైనా వుప్పొంగే సంతోష వార్త తెలిసినా, క్రుంగిపోయే దుఃఖవార్త తెలిసినా ఆమెకు ఫోను చేసి చెప్పాలి అనిపించేది. ఇంకా పసిపిల్లవాడుగానే తను ఆమె మనస్సులో నిల్చిపోయి వుంటాడు. అసలు తను ఆమెకు గుర్తు వున్నాడో లేదో. అది అసలు ' నిజమా కలా ' అని గూడా ఎన్నోసార్లు తనకు అనిపించేది.

ఇరవై సంవత్సరాల తరువాత తను ఆఫీసు పనిమీద విశాఖపట్నం వెళ్తూ రాజమండ్రిలో తన రెండో అక్కయ్యగారి యింట్లో దిగాడు.

వెంటనే పాత యింటికి వెళ్ళి చూశాడు. ఆనాటి అనుభూతులూ, జ్ఞాపకాలూ ఒక్కసారి తనను కమ్ముకున్నాయి.

వెంటనే టెలిఫోను ఎక్స్ఛేంజికి ఫోను చేసి పాత నెంబరు తాలూకు కొత్త నెంబరు కనుక్కున్నాడు.

ఆ నెంబరుకు ఫోను చేశాడు.

" హల్లో " ఒక స్త్రీ కంఠం పలకరించింది.

" పెన్సిలు చెక్కుతుంటే వేలు తెగింది. ఏం చెయ్యమంటారు "

" ఎవరదీ ! నానీ ! ఎక్కడున్నావు ? ఏం చేస్తున్నావు " ఆమె కంఠం రుద్ధమైంది.

నానీ ఒక్కసారి వుత్తేజితుడు అయినాడు. ఆమె కల కాదు. నిజమే. ఇరవై సంవత్సరాల తరువాత ఆ కంఠం తనను అదే మార్దవంతో అదే లాలిత్యంతో పలకరిస్తుంటే తను వుక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు.

## మీకు తెలుసా ?

- హిందూమహాసముద్రంలో సంచరించే 'అసిఫాక్' చేపకు తోకలో కళ్ళు వుంటాయి.
- ఇటలీలోని 14 సంవత్సరముల బాలుడికి 69 mm పొడవు, 42 mm వెడల్పుగల ముక్కు వున్నది.
- హంగేరీ దేశానికి చెందిన ప్రఖ్యాత వయొలిన్ మేధావి 'రెకజ్‌పాలి'కి మొత్తం 48 మంది కొడుకులు. వాళ్లందరూ తండ్రిలాగానే వయొలిన్ విద్వాంసులుగా ఖ్యాతిపొందారు.
- హవాయ్ దేశంలోని వాడుక భాషకు ఉన్న అక్షరాలు పన్నెండు మాత్రమే. ఇన్ని తక్కువ అక్షరాలు ఉన్న భాష మరెక్కడా లేదు.
- ప్రపంచ ప్రసిద్ధిచెందిన చైనావాల్ ఈ చివరి నుండి ఆ చివరికి నడవడానికి పగలు రాత్రి నడిస్తే 21 రోజులు పడుతుంది.
- జపాన్ ప్రభుత్వ రేడియో కేంద్రంలో ఒక రోజుకు 350 ప్రోగ్రాములకు పైగా ప్రసారమవుతున్నాయి.
- శ్రీలంకలో 3 మీటర్ల వరకూ పొడవు పెరగగలిగిన రాక్షస బల్లి తెగ ఒకటి వుంది.

— జాగృతీకిరణ్

తను తిరిగి ఆరుఏళ్ళ పిల్లవాడు అయిపోతున్నాడు. ఈ క్షణం స్థిరమై, నిశ్చలమై యిట్లాగే వుండిపోతే ఎంత బాగుండును. ఈ అనుభూతి అక్షయమై, అవ్యయమై ఇట్లాగే కొనసాగితే ఎంత బాగుండును.

" బి. యస్సీ. పాసు అయినానండీ. విజయవాడలో మెడికల్ రిప్రెజెంటేటివ్‌గా వున్నానండీ" తను తేరుకొని సమాధానం చెప్పాడు.

" చాలా సంతోషం. పెళ్ళి చేసుకున్నావా ? "

" లేదండీ "

## ధన్యోస్మి

**ఈ** సుందర కాశ్మీరంలో
పుట్టినందుకు
**ఈ** రమ్య బృందావనంలో
వడయాడినందుకు
**ఈ** పవిత్ర గంగోదకంలో
మునకలిడినందుకు
**ఈ** దివ్య భగవద్గీతను
పారాయణం చేసినందుకు
**ఈ** మాతృభారతి చరణ సేవకు
నోచుకున్నందుకు
**నేనెంతో** అదృష్టవంతుణ్ణి
నేను నిజంగా అమృత పుత్రుణ్ణి.

— తిరునగరి

" నాన్నగారు ఎక్కడ వున్నారు ? " ఆమె తిరిగి అడిగింది.

" నాన్నగారు పోయినారండీ "

" అయ్యో పాపం ! అమ్మ ఎక్కడ వున్నది ? "

" అమ్మ ప్రస్తుతం నా దగ్గరే విజయవాడలో వుంటున్నది " తను తిరిగి సమాధానం చెప్పాడు.

ఆమె ఫోనులోనే అన్నయ్య గురించి, అక్కయ్యల గురించి, చెల్లెలి గురించి అన్ని వివరాలు అడిగింది. అన్నిటికీ ఓపికగా తను సమాధానం చెప్పాడు.

" నువ్వు ఎవరో తెలియకుండానే, నిన్ను ఎప్పుడూ చూడకుండానే నీ మీద ఎన్నో మమతలూ, అనుబంధాలూ పెంచుకున్నాను సుమా! ఒకసారి తప్పక మా యింటికిరా " అన్నది ఆమె.

" ఇవ్వాళ విశాఖపట్నం వెళ్తున్నానండీ. మూడు రోజులలో తిరిగి వస్తాను. అప్పుడు తప్పక మీ యింటికి వస్తాను " అన్నాడు తను.

ఆమె ఫోనులోనే వాళ్ళ ఎడ్రసు చెప్పింది. ఆమె భర్త ఆడిటర్ అట.

విశాఖపట్నం నుండి మూడు రోజుల తరువాత తిరిగి వచ్చి అదే నెంబరుకు ఫోను చేశాడు నానీ.

ఈ సారి ఒక మగ కంఠం ఫోనులో సమాధానం చెప్పింది.

" హల్లో ఎవరు కావాలండీ ? "

" పిన్నిగారు లేరాండీ "

" ఆమె చనిపోయి రెండు రోజులైంది"

నానీ ఒక్కసారి నిశ్చేష్టుడు అయినాడు.

ఆ మగ కంఠం తిరిగి ఫోనులోనే మాట్లాడింది,

" నానీ అంటే నువ్వేనా అబ్బాయీ ? "

" అవునండీ ! "

" నువ్వు 'పిన్నిగారూ' అని పిల్చే ఆవిడ నా భార్యే నాయనా. ఆమె ఎన్నాళ్ళుగానో కేన్సరుతో అవస్థ పడుతున్నది. మాకు సంతానం లేదు. ఆమె ఎప్పుడో చనిపోవలసింది. ఇన్నాళ్ళూ ఆమె బతికింది అంటే నీకోసమేనేమో. ఎప్పుడో చిన్నప్పుడు నువ్వు ఫోను చేసేవాడివట. నీ కోసం తెగ కలవరించేది. మూడు రోజుల క్రితం నువ్వు ఫోను చేశావట. ఆ మర్నాడే ఆమె మరణించింది " అన్నది ఆ మగ కంఠం.

నానీ ఫోను పెట్టేశాడు.

ఇక తను వాళ్ళ యింటికి వెళ్ళదల్చుకోలేదు.

నిజానికి యీ కథను యీ ముగింపే బాగుంటుంది. తనకు తెలియకుండానే పూజ్యభావాన్ని, ఆరాధనను తను ఆమె మీద పెంచుకున్నాడు. ఆమె మెల్లకన్నుది గావచ్చు. లేదా అవిటిదీ, అనాకారిదీ గావచ్చు. ఆమెను చూస్తే తనకు ఆమెమీద వున్న పూజ్యభావం, ఆరాధనా భావం తొలగిపోవచ్చు. ఈ పూజ్య భావాలు, ఆరాధనా భావాలు శాశ్వతంగా యిలాగే వుండిపోనీ.

నానీ ఒక్కసారి బరువుగా నిట్టూర్చాడు.

( అమెరికాలో జరిగిన యదార్థ గాథ ఆధారంగా)

# ఎవరు గ్రుడ్డివాడు?

**బాలవాణి**
**సోమంచి రామం**

అనగనగా రామాపురంలో రాజయ్య అనే రైతు వుండేవాడు. అతడు చాలా యోగ్యుడు. పదిమందికీ సహాయంచేసే స్వభావం కలవాడు. అతనికి రెండెకరాలే పొలం వున్నా రెండొందల ఎకరాల కామందుకన్నా సంతోషంగా కన్పించేవాడు. తన పొలంలో కష్టపడి పని చేసి పంట పండించుకునేవాడు. ఆ పంటలోనే తానింత తింటూ ఇతరులకు యింత పెడ్తూ అందరికి సహాయకారిగ వుంటున్నాడు. ఊరందరూ రాజయ్యని మంచి మనిషిగ గౌరవిస్తారు. ఎవరినోట విన్నా రాజయ్య మంచితనమే వినబడేది. అయితే రాజయ్యంటే గిట్టనివాళ్ళూ లేకపో లేదు. అలాంటివాళ్ళలో సోమయ్య అనే యిరవై ఎకరాల రైతు వున్నాడు. అతనికి ఎంత ఆస్తి వున్నా యింకా కావాలనే దురాశాపరుడు. పిల్లికి కూడా బిచ్చం పెట్టని వాడని - ఎంగిలి చేత్తో కాకిని కూడ కొట్టడని అందరు చెప్పుకుంటారు. అలాంటి సోమయ్యకు రాజయ్యంటే ఈర్ష్య, అసూయ ఉండడంలో ఆశ్చర్యమేముంది? అయినా రాజయ్య మాత్రం సోమయ్యను ఏనాడూ పల్లెత్తు మాటనేవాడు కాడు.

ఇలా వుండగా దురదృష్టవశాత్తు ఒకసారి రాజయ్యకు ఒక ప్రమాదంలో కళ్ళు రెండూ పోయాయి. దాంతో అతని బ్రతుకే చీకటైపోయింది. ఊళ్ళో వాళ్ళంతా రాజయ్యకు కలిగిన కష్టం గురించి ఎంతో బాధపడ్డారు. సోమయ్య లోపల్లోపల సంతోషించినా పైకి మాత్రం దుఃఖం నటించాడు. ఎలాగైనా రాజయ్యను హేళనచేసి అవమానించాలనే దుర్బుద్ధి పుట్టింది సోమయ్యకు!

పగలల్లా రాజయ్య యిరుగు పొరుగుల సాయంతోను, చేతికర్ర ఊతంతోను ఊళ్ళో తిరిగేవాడు. అప్పుడప్పుడు రాత్రివేళలకూడ ఊళ్ళో మిత్రుల యింటికి వెళ్ళేవాడు. రాత్రిపూట వెళ్ళేటప్పుడు లాంతరు, కర్ర చేతబుచ్చుకుని వెళ్ళేవాడు. రాజయ్యను చూడగానే ఊళ్ళో వాళ్ళు పక్కకు తప్పుకుని దారి చెప్పేవారు.

ఒకరోజు రాత్రి రాజయ్య లాంతరు పుచ్చుకుని చీకట్లో వస్తున్నాడు.

అదే సమయానికి సోమయ్య అటే ఎదురు వస్తున్నాడు.

"ఏం రాజయ్యా! బాగున్నావా?" అన్నాడు సోమయ్య.

"ఓ! సోమయ్యా!...." అంటూ గొంతును పట్టి గుర్తుపట్టేశాడు రాజయ్య!

"ఆ!.... ఆ!.... నేనే!...." అంటూ "అదిసరే గాని రాజయ్యా!.... ఇన్నాళ్ళూ నువ్వు ఒట్టి గుడ్డివాడివే ననుకున్నాను.... నువ్వు వట్టి తెలివి తక్కువ వాడివి కూడా! నని యిప్పుడర్థమయింది...." అంటూ హేళనగ నవ్వాడు సోమయ్య!

రాజయ్య మనస్సు కలుక్కుమన్నది. అయినా శాంతంగానే "అలా ఎందుకనిపించిందయ్యా నీకు?" అన్నాడు.

"ఎందుకా? తెలివి తక్కువ తనం కాకపోతే - నువ్వు గుడ్డివాడివి కదా! - నీకు కళ్ళు కనపడవు కదా!- నీకు వెలుగు కనపడదు - అలాంటప్పుడు ఈ చీకట్లో నీ చేతిలో దీపం ఎందుకు?.... వట్టి తెలివి తక్కువతనం కాకపోతే!" అంటూ నవ్వాడు సోమయ్య.

రాజయ్యకు కోపం వచ్చినా దిగమ్రింగుకున్నాడు.

"అదా! నీ సందేహం సోమయ్యా!.... ఆ దీపం నాకోసం కాదయ్యా! చీకట్లో నీలాంటివాళ్ళు నడిచేటప్పుడు దీపాన్ని చూసైనా నన్ను ఢీ కొట్టకుండా ఉంటారని .... తెల్సిందా?" అంటూ ముందుకు సాగిపోయాడు రాజయ్య.

ఇంతకీ ఎవరు గ్రుడ్డివాడు?

# విద్యకు సాటి ధనంబు లేదిలన్

" విద్య " అనునది - " విద్ " అను ధాతువు నుండి వచ్చినది - విద్ - వేద్ - తెలిసికొను (To know) అని భావము. తెలిసికొనవలసినదేది ? ఏది చేయదగినది, ఏది చేయకూడనిది - అన్న విచక్షణ జ్ఞానమును కల్గించునదియే - విద్య. " సదసద్వివేక చతురతగల్గు " " ఏ పని చేసిన మనకు హితము కల్గును ? " అను విషయమును తెలియపరచును. విద్య అన నెట్టిది ? విద్య యొక్క విశిష్టత లెట్టివి ? అని విచారించగా అజ్ఞాన నివృత్తికి, ప్రతివానికి విద్య అవసరమని, మంచి చెడుగుల విమర్శన కుపయోగించునని, క్షేత్రముతోబాటు బీజము కూడా మంచిదైననే గాని ఎట్లు మొలకెత్తదో, ఆ విధముగనే విద్య కూడా సద్గురువువలననే తెలియదగినదని రాక్షసుడు, క్రూరుడైనట్టి హిరణ్యకశిపుడే ప్రహ్లాదునితో చెప్పి గురువుల కడకు పంపించెను.

## ఆర్. వి. ఎన్. సుబ్బారావు

" చదువనివా డజ్ఞుడగు । చదివిన
సదసద్వివేక చతురత గలుగున్ ।
చదవగ వలయును జనులకు ।
చదివించెద నార్యులొద్ద చదువుము తండ్రీ "
(భాగ)

ధన ధాన్యాదికములు ఇతరుల కిచ్చిన తరిగిపోవును. కానీ విద్య అట్లు కాదు. ఇతరులకు చెప్పినకొలది, అభివృద్ధి చెందుచుండును. వాటివలె దొంగలెత్తుకు పోగలరన్న చింతయే లేదు. అది ఇతరులకు కానరాని విధముగ దాచిపెట్టుకొన్న ధనము వంటిది, క్రొత్త తావులందు బంధువువలె తోడ్పడును. అంతేకాదు ప్రభువుల మన్ననను పొందుట కుపకరించును. జంతు ప్రవృత్తి నుండి మానవుని పృథక్కరించునట్టి విద్య నెఱుంగనివాడు మనుష్యుడని ఎట్లు పిలువబడగలడు ?

" విద్య నిగూఢ గుప్తమగు విత్తము, రూపము
పురుషాళికిన్,
విద్య యశస్సు, భోగకరి, గురుండు;
విదేశబంధుడున్
విద్య విశిష్టదైవతము, విద్యకు సాటి ధనంబు
లేదిలన్,
విద్య నృపాలపూజితయు, విద్య నెఱుంగనివాడు
మర్త్యుడే "

అంతేకాదు. అనేక సందేహములను తీర్చి చీకటిని పోగొట్టు జ్యోతివలె అజ్ఞానాంధకారమును పారద్రోలు విద్యయే మానవులకు నిజమైన (జ్ఞాన) నేత్రము - చర్మ చక్షువు కాదు. విద్య లేనివాడే నిజమైన గుడ్డివాడు కానీ జాత్యంధుడు కాదు.

" పలు సందియముల దొలచును
వెలయించు నగోచరార్థ విజ్ఞానములు లో
కుల కక్షి, శాస్త్రమయ్యది
యలవడ దెవ్వనికి వాడె యంధుడ జగతిన్ "

ఏ విధముగ పరలోక సాధనకై, మృత్యువాసన్నమై యున్నదన్నట్లు, దానధర్మాది సత్కార్యములు చేయదగునో, అటులనే - ముపలితనము మరణములు - లేవనునట్లు విద్యా విత్తనముల నార్జింపవలెను - వాడే వివేకవంతుడు

" జరయు మృతియు లేని జనునట్లు ప్రాజ్ఞుండు,
ధనము విద్యయు గూర్ప దలప వలయు,
ధర్మ మాచరింపc దగు మృత్యుచే దల
వట్టి యీడ్వబడిన వాడు వోలె "

విద్య వలన వినయము, దానివలన పాత్రత, దాని వలన ధనము దానివలన ధర్మము దానివలన ఇహపర సౌఖ్యములు, కలుగుచున్నవి.

" విద్య యొసగు వినయంబు. వినయమునను
బడయు పాత్రత, బాత్రత వలన ధనము,
ధనము వలన ధర్మంబు, దానివలన
నైహికాముష్మిక సుఖంబులందు నరుడు "

రాజు తన దేశమునందే పూజింపబడును కానీ, విద్వాంసుడన్ననో ప్రతిచోటనూ పూజింపబడును.

"స్వదేశే పూజ్యతే రాజా, విద్వాన్ సర్వత్ర పూజ్యతే"

విద్య వలన అమృతత్వము కల్గును. "విద్యయాఽమృతమశ్నుతే" "రససిద్ధాపి కవయః" కవులు, వారి రస సిద్ధిచే జరామరణము లేని శాశ్వత కీర్తి గాత్రులగుచున్నారు.

నిజమైన ఆనందము తండ్రికి పుత్రుడు కల్గినప్పటి కంటెను, జనులు వాని గుణములు ప్రశంసించినపుడది కానందము కల్గును.

" పుత్రోత్సాహము తండ్రికి,
పుత్రుడు జన్మించినపుడె, పుట్టదు జనులా,
పుత్రుని కనుగొని పొగడగ,
పుత్రోత్సాహంబునాడు పొందుర సుమతీ "

ప్రతివాడు తానందరను జయించవలెనని కోరుకొనును. కానీ తన కొడుకు తనకంటె విద్యాధికుడై యుండవలెనని ఆకాంక్షించును. "పుత్రాదిచ్ఛేత్పరాజయమ్"

బ్రతుకు తెరువును కల్పించి, ఇహ పర ప్రదాయక మైనదియే, విద్య. అందుచేతనే విద్యను ప్రసాదించు గురువు పరబ్రహ్మతో సమానముగా చెప్పబడుచున్నాడు. ఇతర వ్యాపకములను దరి రానీయక, సతతము విద్యా సముపార్జనయందే నిమజ్జుడై యుండు విద్యార్థియే తనకు తనవారికి గౌరవము చేకూర్చగల్గుచున్నాడు. విద్యకు భేదభావనయే లేదు. విజ్ఞానము విశ్వమును కరతలామలక మొనరించుచున్నది. విద్యాధికులున్న దేశమే పురోభివృద్ధి గాంచుచున్నది. విద్యకు సాటి ధనంబులేదిలన్.

## అవార్డు పొందిన ఉత్తమ ఉపాధ్యాయులు

కృష్ణాజిల్లా ప్రజాపరిషత్ హైస్కూలు, మాజేరు ప్రధానోపాధ్యాయులు శ్రీ సోమంచి శ్రీరామచంద్రమూర్తిగారు నేషనల్ ఫౌండేషన్ అవార్డును, బందరు జైహింద్ హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ ఆర్. ఆర్. శర్మగారు రాష్ట్ర ప్రభుత్వ మెరిటోరియస్ అవార్డును పొందిన సందర్భమున 'శ్రీవాణి' ప్రత్యేక అభినందనలు. వీరిరువురు ఉత్తమ ఉపాధ్యాయులు శ్రీవాణి రచయితలని తెలియ పరచుటకు సంతసించుచున్నాను. వారికి యింకా శక్తి సామర్థ్యములను, ఆయురారోగ్యములను ప్రసాదించమని భగవంతుని ప్రార్థిస్తున్నాము

— సం.

# చేపల వేటలో దిట్ట లకుముకి పిట్ట

చేపల వేటలో దిట్ట లకుముకి పిట్ట

పంటకాలువల, చెరువుల ఒడ్డున వుండే చెట్టు కొమ్మల మీద కూర్చుని, ముక్కును ఎండు కొమ్మలకు రాస్తూ పదును పెట్టుకుంటూ కనిపిస్తుంది లకుముకి పిట్ట. సేద తీర్చుకుంటున్నట్లు కనిపించినప్పటికీ, లకుముకి పిట్ట దృష్టి ఎప్పుడూ నీటిమీదే వుంటుంది. నీటిలో చేప అలికిడి కనపడగానే హఠాత్తుగా ఎగిరి వెళ్ళి, నీటిలో ముక్కును ముంచి చేపతో తిరిగి కొమ్మను చేరుతుంది. ఆ విధంగా చేపలను వేటాడటంలో లకుముకి పిట్టకున్న నేర్పు మరే ఇతర పక్షికి లేదనే చెప్పాలి.

లకుముకి పిట్ట మనం సాధారణంగా చూసే గోరింక సైజులో లేదా ఇంకా కొంచెం పెద్దదిగానో వుంటుంది. వూదా రంగులో వుండే మెడ, ముక్కు, పొట్ట భాగాలు లకుముకి పిట్టలో కనిపిస్తాయి. రెక్కలు నీలం రంగులో వుంటాయి. పొడవుగా, ధృఢంగా వుండే ముక్కు చేపల వేటలో ఉపయోగపడుతుంది.

మన దేశంలో 12 జాతుల లకుముకి పిట్టలు కనిపిస్తాయి. వీటిలో కొన్ని పూర్తిగా ఆహారం కోసం చేపలమీద ఆధారపడితే కొన్ని కీటకాలను, మిడుతలను, తొండలను ఆహారంగా తీసుకుంటాయి. కొన్ని జాతులు నీటిమీద ఎగురుతూ చేపలకోసం వెతుకుతుంటాయి.

లకుముకి పిట్టలు సాధారణంగా జీవితంలో ఒకసారే జోడు కడతాయి. మార్చి–జులై నెలల మధ్యలో ఆడపక్షి గుడ్లు పెడుతుంది. కాలవల, చెరువు గట్లమీద వుండే మట్టిని తొలిచి ఒక గుహలాగా తయారుచేస్తాయి. అదే దీని గూడు. ఈ గూడు ఒక మీటరు పొడపు వుండొచ్చు.

నాలుగు నుండి ఏడు గుడ్లవరకు పెడుతుంది. గుడ్లు మొదట తెలుపు రంగులో వుంటాయి. ఆ తరువాత వాటి మీద ఒక రకమైన మచ్చలు ఏర్పడతాయి. గుడ్లనుండి పిల్లలు మూడు వారాల్లో బయటపడతాయి. మొదట తలితండ్రులు ఆహారం అందిస్తాయి. వారం రోజుల్లోనే పిల్లలు తమంత తాము ఆహారం వేటాడటం నేర్చుకుంటాయి. నెల రోజుల వయస్సున్న పిల్లలను గూటినుండి తరిమివేస్తాయి. అప్పటినుండి వాటి జీవనం అవి సంపాదించుకోవాల్సిందే.

- డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

